# కామినీహృదయం

కొడవటిగంటి కుటుంబరావు



ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ.

ఇందులో

కామినీ హృదయం

సత్యవతి స్వీయకథ

కొరకరాని కొయ్య

నడమంత్రపు సిరి

# కామినీహృదయం

## మొదటి రంగం

సుశీల : ఏమండీ, స్నానాలకు లేస్తారా ? ఏమిటి ?

చంద్ర : అమ్మాయి యింకా రాలేదల్లే ఉందే ?

సుశీ : వస్తుందిలెండి. నాలుగుచోట్లకు పోయి పిలిచిరావాలి గద. పరీక్ష పాసుకావటం అలావుంచి క్లాసుకూడా తెచ్చుకుంది గనక, ఎక్కడికి పోయినా దబ్బున కదిలి రానివ్వరు మరి– నాన్నగారేదో ఉత్తరం రాసుకుంటున్నట్టున్నారు. నువ్వయినా లేచి స్నానం చేసిరారా, రాఘవా. నీ తరవాత నాన్నగారు చేస్తారు. ఇంతలో సావిత్రి రానేవస్తుంది. భోజనాలు చేసేద్దాం.

చంద్ర : మరేం లేదు. అమ్మాయికి రాజమండ్రీలో ఒక సంబంధం ఉందని కైలాసం రాశాడు చూశా, వాళ్ళకి కట్నాలు కానుకలను గురించి ఏపాటి ఉద్దేశం ఉందో కనుక్కోమని కైలాసానికి రాస్తున్నా.

సుశీ : రాయండి. ఆ కుర్రాడి ఫోటో చూసి అమ్మాయి సరేనంది. ఒకవేళ మనిషిని చూస్తే ఏమన్నా ఉద్దేశం మార్చుకుంటుందేమో మరి... అన్నట్లు అమ్మాయి క్లాసుతో పాసయిందనికూడా మాటవరసగా రాయండి.

చంద్ర : రాసేశాగా. పోతే...కుర్రాణ్ణి ఒకసారి చూడటం మంచిదిగద. ఆ ఏర్పాటుకూడా చేయమని రాద్దామా ?

సుశీ : దానికేం ? రాయండి...లేవరా, నాయనా! ఏమిటాలోచిస్తున్నావ్ ?

రాఘు : ఆc...మరేమీ లేదు. ఆడపిల్లల పెళ్ళిళ్ళకోసం ఇంత తాపత్రయపడతారే, మగవాడి పెళ్ళికి ఇందులో పదో వంతుకూడా పడరేమా అని...

సుశీ : అని నువ్వనుకుంటున్నావు. రెండేళ్ళనుంచి నీకోసం ఎన్ని సంబంధాలు వెతికామో లెక్కేలేదు. ఇంతవరకు కుదిరిందీ?

రాఘు : అందులో కొన్ని సంబంధాలు మనం ఎందుకు వద్దనుకున్నామో నాకే తెలీదు. నిన్న సాయంకాలం రిజల్ట్సు చూసివస్తూ దారిలో సరోజను చూసివచ్చాను. ఏడాది కిందట వాళ్ళు సరోజను చేస్తామన్నారు. మనం వద్దనకపోతే అప్పుడే మా ఇద్దరికి పెళ్ళయిపోయుండేది. నా మొహానికి ఆపాటి అందగత్తె దొరికేయోగం లేకకాబోలు మనం వద్దనేశాం. అంత అందమైన పిల్ల దొరికితే నావంటి దౌర్భాగ్యుడు తప్ప వద్దనడనుకుంటా.

సుశీ : నీ కిలా అనిపిస్తుందాంటే నేను వద్దనకపోదునుసుమీ... ఎంత పొరపాటైపోయిందీ? పెళ్ళియోగం లేనివాళ్ళలాగా నువ్వు ఎవతో ఒకతె దొరికితే చాలుననుకుంటావని నేను కలగన్నానా?

రాఘు : నేను ఎవతో ఒకతె దొరికితేనే చాలునన్నానా?

సుశీ : సరోజను చేసుకునే అవకాశం ఉంటే ఎవరూ వదులుకోరన్నావు కాదురా. నాకు తెలిసినమట్టుకు నిన్ను కాక ఇంకా అరడజనుమందిని సరోజను చూశారు. ఏ ఒకటీ కుదరలేదు. అవన్నీ నీకన్న మంచి సంబంధా లనుకోవలసిందేనా?...మాట్లాడవేం? ఏం మాట్లాడతావూ? సావిత్రికి ఇప్పుడే సంబంధం చూస్తున్నామంటే పిల్లో ఎటు

నంటి సంబంధాలను తిప్పేశారో నీ కేమైనా తెలుసా? నాయనా, సినిమా ఎక్స్ట్రాలలోకూడా అందమైనవాళ్ళు వున్నారుట...నీ పెళ్ళివిషయం ఆలోచన వచ్చినప్పుడల్లా కాస్త మన పరువుప్రతిష్ఠల్ని గురించి కూడా ఆలోచించు.

రాఘు: (లొంగిపోయిన గొంతుతో) ఆ విషయం నాకూ తెలుసునమ్మా. కాని రేపు సరోజకు నాలాంటి సంబంధమే వస్తే...?

సుశీ: వచ్చినప్పటిమాట గద. నేను చెబుతున్నా విను. సరోజకు నీ కన్న గొప్ప సంబంధం ఎలాగూ రాదు. కాని నీకు మాత్రం అంతకంటె మంచి సంబంధం వస్తుంది. చూస్తూ ఉండు...

రాఘు: చూడక నేనుమాత్రం ఏం చేస్తున్నానూ?...అరె, సావిత్రి రానే వచ్చిందే!

సుశీ: ఏమే, అమ్మాయ్, అందరినీ సాయంత్రం పార్టీకి పిలిచావా?

సావిత్రి: అందర్నీ పిలిచానమ్మా. ఇందిరమటుకు ఊళ్ళోలేదు.

సుశీ: పోనీ మిగిలినవాళ్ళంతా వస్తారా?

సావి: సరోజవిషయమే కొంచెం అనుమానం. నేను వాళ్ళింటో ఉండగానే వాళ్ళ మేనమామ ఢిల్లీనుంచి వచ్చాడు. ఆయనవెంట మనోరంజన్ అని మరోఅతను కూడా వచ్చాడు.

రాఘవ: ఎస్. మనోరంజనే! (ఆశ్చర్యంతో)

సావిత్రి: ఎస్. మనోరంజనో, నో మనోరంజనో నాకు తెలీదు. ఢిల్లీలోనే పనిచేస్తున్నాట్ట. కొంచెం సన్నగా,

పొడుగ్గా ఉంటాడు. కనుబొమ్మలు పెన్సిల్‌తో గీసి నట్టుంటాయి.

రాఘవ : (సంతోషంతో) వాడే, వాడే...వాణ్ని అదృష్ట దేవత పెంపుడుకొడుకు అనేవాళ్ళం. వాడి తాత దివాన్‌బహద్దూర్. తల్లివైపు తాత చిన్న జమీందారు. వాళ్ళమ్మకు దాదాపు లక్షరూపాయల నగకట్టున్నదని చెప్పుకునేవాళ్ళు. బంగారపు మట్టెలు పెట్టుకునేదట. కిందటేడే ఎమ్మెస్సీ పాసయినాట్ట. వెంటనే ఉద్యోగం దొరికింది. ఏదో రిసెర్చి చేస్తున్నాడని విన్నా. వీడు సరోజ వాళ్ళింటి కెలా వచ్చాడబ్బా ?...

సావిత్రి : నువ్వు చెప్పేఅతనే కావచ్చు రాఘవన్నయ్యా ! ఇతను ఎమ్మెస్సీయే. సరోజ మేనమామతో కలిసి వచ్చాడని చెప్పానుగానా? ఆ అబ్బాయి నీ కెలా తెలుసూ ?

రాఘ : నేను హాస్టల్లో ఉండి ఇంటరు చదివిన రెండేళ్లూ వాడు నాకు క్లాసుమేటే.

సుశీ : అంత స్నేహితుడయితే, నువ్వు కలుసుకున్నట్టూ అవుతుంది, సాయంత్రం పార్టీకి పిలుచుకురాగలవా ఏమిటి? ఆ సరితాదేవి చేసే న్యూసెన్సు తప్పిస్తే ఆ కొంపలో అతనికిమాత్రం ఎలా పొద్దుపోతుందీ?

రాఘ : వాడు దొరకాలేగాని తప్పక వస్తాడు.

సుశీ : ఏమండీ, ఆ ఉత్తరం తరవాత రాయొచ్చుగాని లేచి స్నానంచేద్దురూ. పిల్ల ఏడుగంటలకనంగా గుక్కెడు కాఫీ తాగింది. ఆకలవుతూందో ఏమోనూ.

చంద్ర : అయితే నేనే ముందువెళ్లి స్నానంచేస్తా. ఏం, రాఘువా?

రాఘు : నువు వెళ్లు నాన్నా. నేను తరవాత చేస్తాలే. స్నానానికి ఆఖరుకు పొమ్మన్నారు.

సుశీ : అమ్మాయ్. వడ్డించమని వంటావిడతో చెప్పు తల్లీ. ఆవిడ పీటలు వెయ్యటానికే గంట తీసుకుంటుంది.

సావిత్రి : (పోతూ) చెబుతున్నానమ్మా.

సుశీ : ఆ అబ్బాయి కింకా పెళ్లి కాలేదా ఏం రా?

రాఘు : నాకు తెలిసినంతవరకూ కాలేదు.

సుశీ : ఎన్నేళ్లుంటాయేం?

రాఘవ : నాయీడేనమ్మా. మన సావిత్రిలాగే అవలీలగా క్లాసు తెచ్చుకునేవాడు. భలే తెలివిగలవాడు.

సుశీ : ఇవాళే అమ్మాయి రిజల్ట్సు రావటమూ, ఇవాళే ఆ అబ్బాయి ఢిల్లీనుంచి రావటమూ చిత్రంగా లేదూ?

రాఘు : అవునమ్మా...ఏమిటి నవ్వుతున్నావు?

సుశీ : ఏంలేదు. ఆ. సరోజ తల్లికి కొంచమైనా విచక్షణా జ్ఞానం లేదు. ఎల్లాగయినా ఈ అబ్బాయికి సరోజను అంటగట్టాలని అష్టకష్టాలూ పడుతుంది.

రాఘు : (నిట్టూర్చి) అంతదాకా వస్తే వాడు సరోజను చేసుకోనూవచ్చు.

సుశీ : నీకెంత పిచ్చిరా. ఈ కుర్రాడు నీకు దొరుకుతాడామరి?

రాఘు : వాడెక్కడికి పోతాడమ్మా. నేను సెక్రటేరియట్‌కు టెలిఫోన్ చేసి క్షణంలో పట్టనూ? ఏదో గవర్నమెంటు పనిమీదే వచ్చివుంటాడు. ఇప్పుడే వస్తాను.

సుశీ : ఏమండీ, అప్పుడే స్నానం అయిపోయిందా ఏం?

చంద్ర : ఎంతసేపూ? రాఘు వేడీ?

సుశీ : టెలిఫోన్ చేయబోయాడు. మీరుమాత్రం ఇవాళ ఆ కైలాసానికి ఉత్తరం రాయకండి.

చంద్ర : తొందరేముంది? నింపాదిగానే రాయొచ్చు.

సుశీ : మీ ధోవతీ, షర్టూ డ్రెస్సింగ్ టేబిల్ మీద ఉన్నాయి, వెళ్ళి డ్రెస్ చేసుకోండి – ఏమే; తల్లీ!

సావిత్రి : పదినిమిషాల్లో వడ్డన పూర్తిచెయ్యమన్నా నమ్మా, అన్న స్నానానికి వెళ్ళాడా?

సుశీ : ఇంకాలేదుగానీ, ఆ అబ్బాయి చూడటానికి బాగుంటాడు టే? ఆ రాజమండ్రి కుర్రాడిపాటైనా ఉంటాడా?

సావిత్రి : అతనికీ ఇతనికీ పోలికేమిటమ్మా? ఇతను చ-హా-లా బావుంటాడు.

సుశీ : అలాగా. అయితే ఆ సరితాదేవి ఆ కుర్రాడి చుట్టూ డాన్సుచేస్తున్నదా?

సావిత్రి : ఆవిడ మామూలుకేమీ భిన్నంలేదు.

సుశీ : సరోజ ధోరణి ఎలావుంది?

సావిత్రి : అమ్మో...అది బయటపడదు. చాలా కూబి.

సుశీ : అది కూబిగానీ, ఊబిగానీ, మనకేంటెఖ్ఖు. మన రాఘువను కలుసుకున్నాక ఆ కుర్రాడసలు మనింటికే వచ్చేస్తాడు.

రాఘు : (వస్తూ ఉత్సాహంగా) నే చెప్పలా? ఏదో కాన్ఫరెన్సుట. సాయంకాలం నాలుగింటికి బయటపడతాడు. నేను వాణ్ణి పడతాగా.

సుశీ : సరే, నువ్వు వేగిరంవెళ్ళి స్నానంచేసి, డ్రెస్ చేసుకుని భోజనానికి రా. మేం పోతున్నాం.

రాఘు : నిమిషంలో రానూ!

# రెండవ రంగం

[అదే చోటు. ఆ సాయంకాలం అయిదుకు,
కారు హారన్ చప్పుడు]

సావిత్రి : అమ్మా, రాఘవన్నయ్యా వచ్చినట్టుందే...

సుశీ : ఆహా... ఆ రెండో అబ్బాయేనా మనోరంజన్ ? వచ్చి చూడూ ?

సావిత్రి : అవునమ్మా...

సుశీ : నువ్వు కిందికి పోయి వాళ్ళని ఇక్కడికే తీసుకురా. నేను కాఫీ కలిపి పంపిస్తా...(వెళుతుంది)

సావిత్రి : (స్వగతం) ఆడపిల్లకు తెలివైన తల్లి ఉండటంకన్న అదృష్టమేముంది ! అమ్మ నాకీ సంబంధం చెయ్యగలిగితే చదువు మానేస్తాను. ఏం చదువు, వెధవ చదువు. క్లాసు కోసం ఒకే చదువు. సరోజ చచ్చినా చదవదు. అందుకనే అది ఆరోగ్యంగా ఉంటుంది. అదికూడా పెళ్ళికోసం తహ తహలాడిపోతోంది. కాని వాళ్ళమ్మకు చాకచక్యం కొంచెమైనా లేదు. ఆవిడ దానికి తగిన సంబంధం తీసుకు రాలేదు.

రాఘు : హాలో...రంజన్‌ను తీసుకొచ్చేనే ... ఇదేరా నా సిస్టర్—సావిత్రి. మిస్ ఇంటర్ మీడియేట్...

రంజన్ : శ్రీనివాసరావుగారి అక్కగారింట్లో ఉదయం చూశాను. అవునుగానీ పరీక్షలో పాసయితే మిస్ ఎలా అవుతుందిరా...

రాఘు : (గట్టిగా నవ్వుతూ) హోఁహోఁహోఁ...జీవితంపరీక్షలో పాసయితే మిసెస్ అవుతుంది. అంతేనంటావా? అందులో తెచ్చుకోవాలి క్లాస్. కాపిటల్, కాపిటల్. (తన తెలివికి తానే ఆనందిస్తాడు)

సావిత్రి : ఇలా వచ్చి కూచోండి.

సుశీ : (వస్తూ) వచ్చావురా నాయనా, రాఘువా! ఈయనేనా నీ స్నేహితుడు ?

రాఘు : అవునమ్మా...మా అమ్మరా. రంజన్...

రంజన్ : నమస్కారమండి...

సుశీ: నమస్కారం. నిన్ను గురించి మా రాఘువుడు ఎప్పుడూ చెబుతూంటాడు. నీకు తెలిసేవుంటుంది. మా వాడు త్వరగా స్నేహంచేసేరకం కాదు. కాని స్నేహంచేస్తే మాత్రం ప్రాణం ఇచ్చేస్తాడు. సావిత్రికూడా అంతే. నూరుమంది క్లాసుపిల్లలలో దానికి గట్టిగా నలుగురు స్నేహితురాళ్ళయినా లేరు. ఉన్న ఒకరిద్దరూ ఈపూట వస్తారుగా. మీరు కాస్త కాఫీ తీసుకొంటారా...

రాఘు : ఇస్తే ఎందుకు తీసుకోం ? పిల్లనిస్తే చేసుకోనివాడూ, కాఫీ ఇస్తే తాగనివాడూ "వసుధనెందును లేడు, దైవంబు తోడు"...

రంజన్ : కాఫీ కావాలని చెప్పటం సొంపా ఏమిటి ?

రాఘు : కాఫీ ఒకటేనా ? చేస్తే పెళ్ళికూడా చేసేసుకుంటాను. ఇదుగో మాసావిత్రమ్మకు పెళ్ళవుతే నాకూ అవుతుంది.

సుశీ : నువ్వంటే ఎవరినైనా సరే చేసుకుందామని ఉన్నావు గాని అది ఒకంతట యెవరినీ ఒప్పదే. ఎంతలేసి సంబంధాలు తోసేసింది... నేను వెళ్లి కాఫీ పంపుతా.

రంజన్ : మీరు బియే చదువుతారా? ఇంతటితో మానేసి మా రాఘవరావుకోసం పెళ్లి చేసుకుంటారా?

సావిత్రి : చదువుకోసం పెళ్లిమానను. నాకు నచ్చినసంబంధం వస్తే...

రంజ : అది నేనూ ఒప్పుకుంటాను. చాలామంది పెళ్లికోసం చదువు మానేస్తారు. నా స్నేహితు డొకడుండేవాడు. స్కూలుఫైనలు చదువుతూ పెళ్ళిచేసుకున్నాడు. బియే పాసయేనాటికి ముగ్గురు పిల్లల తండ్రి...

రాఘు : ముగ్గురుపిల్లలతండ్రి బియే ప్యాసుకావటంలోనూ, ముగ్గురుపిల్లల తల్లి బియే ప్యాసుకావటంలోనూ తేడా వుందని నువ్వు ఒప్పుకుతీరాలి. నేను పెళ్లాడితే నా భార్యను చదవనివ్వను. చదువుకూ సంసారానికీ తూగదు.

రంజ : ఏమో, నేను పెళ్లాడేటట్టయితే నా భార్యను చదవనిస్తాను సుమా.

సావి : నేను మటుకు నా ప్రాణంపోయినా నన్ను చదవనివ్వని మనిషిని పెళ్లాడను.

సుశీ : (వస్తూ) ఇదిగోనర్రా కాఫీ కప్పులు వాళ్ల కియ్యి. తల్లీ ...ఏం, నాయనా, నీకు కాఫీ అలవాటు తప్పిపోలేదుగద.

రంజ : నాకాండీ. లేదండి. ఢిల్లీలో అన్నప్పుడల్లా మంచి కాఫీ దొరకదు. అందుచేత కాఫీమీది వ్యామోహం మరింత అయింది. ఈ కాఫీ చాలా బాగుంది సుమండీ.

సుశీ : కాఫీలో కూడా చేతితీరుంటుంది. సావిత్రికి కాఫీ కుదిరి నట్టు నాకు కుదరదు. వాళ్ళనాన్నగారికి కాఫీ అది కలపాలి సిందే. దానికి చెయ్యి వీలుగాలేక నేను కలిపానో ఆయన వెంటనే పట్టేస్తారు. నా మాట విని చక్కగా కాఫీ చేయ గలదాన్ని చూసి పెళ్లాడేవో ఢిల్లీ కాదుగదా డార్జిలింగు వెళ్ళినా కాఫీ బెడద వుండదు.

రాఘు : అవున్నా, రంజన్, పేపర్లో ఒక ప్రకటన వెయ్యి "కాఫీ చెయ్యటంలో పోటీ, పోటీలో నెగ్గినవారికి బహుమానం ...రంజన్" హాహాహా...నవ్వుతాడు.

సుశీ : ఇంకేం, నాన్నగారుకూడా వచ్చారు. ఆయనకూడా కాఫీ తెస్తా.

రాఘు : సావిత్రిని వెళ్ళమను.

సుశీ : ఊహుం, ఈపూటకు ఆయనకు నాచేతి కాఫీ తప్పదు.

చంద్ర : ఏమిట్రా విషయం. నాకూడా చెప్పరూ ?

రాఘు : ఏంలేదు నాన్నా. సావిత్రి కాఫీ బాగా చేస్తుందనీ, అందుకని నువ్వు అది చేసిన కాఫీ తప్ప తాగవనీ అమ్మ నిన్ను ఎద్దేవా చేస్తోంది.

చంద్ర : అసలా విషయం ఎందుకొచ్చింది?

రాఘు : ఢిల్లీలో మంచి కాఫీ దొరకటం లేదూ, ఎవరన్నా బాగా కాఫీ చేసేదాన్ని చూసి పెళ్లాడేస్తానూ, అంటు న్నాడు రంజన్.

చంద్ర : ఓహో...ఇతనేనా యేమిటి నీ స్నేహితుడు ?

రాఘు : సారీ. నాన్నా, నా స్నేహితుడు మనోరంజన్. రంజన్, మా నాన్న.

రంజ : నమస్కారమండీ.

చంద్ర : నమస్కారం. అయితే నువ్వు ఢిల్లీలో వుంటున్నావు టోయ్ ? చదువు పూర్తిఅయి ఉద్యోగంలో ప్రవేశించి కూడా ఇంకా పెళ్ళిచేసుకోలేదూ? ఢిల్లీలో వుండిపోయావు గనుక నీవంటి యంగ్ మాన్‌ని వొదిలిపెట్టారుగాని, ఇక్కడుంటే యీపాటికి ఎగరేసుకుపోయివుందురు. అందుకే నటేశమొదలియార్ ఎప్పుడూ అంటూంటాడు: "ఆడపిల్లలంతా మద్రాసులో వున్నారు. కుర్రాళ్ళంతా న్యూఢిల్లీ చేరారు. ఢిల్లీలో ఒక మేట్రిమోనియల్ రెప్రజెంటేటివ్‌ని పెట్టేస్తేగాని వాళ్ల సమస్యా మన సమస్యా తీర" దని. అలాగే వుంది చూడగా. ఓల్డ్‌మాన్స్ క్యూరియాసిటీకి ఏమీ అనుకోకు. నువ్వు పెళ్లాడకపోవటానికి కారణం ఏమిటీ? తగిన పిల్ల దొరక్కనా; తగినంత కట్నం రాకనా? నీకేమైనా ఫారన్ వెళ్లాలనే ఇంటెన్షన్ వుందా? యేమిటి విషయం?

రంజ : అడిగారు గనక నిజం చెప్పేస్తాను. నాకు పెళ్లంటే ఒక్క పిసరు భయం.

చంద్ర : (నవ్వి) అదేం? వాళ్ళు పీక్కు తింటారుటోయ్?

రంజ : అవునండీ, షైలాక్ చెయ్యలేని పని వాళ్ళు చేస్తారు. రక్తంబొట్టు రాలకుండా మాంసం హరిస్తారు.

చంద్ర : గుడ్ హెవెన్స్! నీలో నీకు విశ్వాసం వుంటే ఆడదంటే ఇలా భయపడవు.

రంజ : మీ అభిప్రాయం నాకర్థమయింది. కాని నేను ఆత్మవిశ్వాసం లేక మాట్లాడటంలేదు. సాధారణంగా ఏ పిల్ల

నైనా చూసి పెళ్ళాడటమంటే పేకేజి చూసి కొనటమే. తీరా కొన్నాక లోపల యేముంటుందో తెలీదు.

చంద్ర : ఒకవిధంగా నేనూ ఒప్పుకుంటాను. ఆడదాని హృదయం తెలుసుకోవటం సాధ్యం కాదు.

రంజ : అదికూడా నాకు భయంలేదు. ఆడదాని హృదయం అగమ్యగోచరమని చేసే ప్రచారాన్ని నేను నమ్మను. నూటికి తొంభై స్త్రీహృదయాలు కేవలం డొల్లలు. వాటిల్లో యేమీ వుండదు. అయితే నాకు చిరాకెత్తించే దేమంటే ఈ డొల్లలను వాళ్ళు చాలా గోప్యంగా ఉంచుతారు. పెళ్ళయిన కొంతకాలానికైనా వాటిల్లో యేముందో తెలియకపోదు. ఆ తరవాత భర్తకి ఆశా భంగం. ఆడదానిలాగా మగవాడు కళ్ళు మూసుకుని అన్నిటికీ సిద్ధమై, నీటిలోకి ఉరకలేడు. తనకోసం, తన పెళ్ళాం కోసం, పిల్లల కోసం జీవితం నిర్మించే భారం మగవాడిది.

చంద్ర : (క్షణం ఆలోచించి) వెల్, అందరు ఆడవాళ్ళూ నువన్నట్టుంటారని తోచదు.

రంజ : ఆమాటకొస్తే అందరు మగాళ్ళూ నాలాగా వుండరు కూడా లెండి.

చంద్ర : నే చెప్పేదల్లా ఒకటే. మంచి భార్యలు దొరికే చోటికి వచ్చావు. నీకు తగిన చదువూ, సంస్కారమూ, స్టేటసు గల పిల్లను చూచుకోకుండా తిరిగి వెళ్ళకు, అదే నాసలహా.

రంజ : థాంక్స్...

చంద్ర : మంచి సంబంధం దొరికితే మా సావిత్రికి ఈ యేడు పెళ్లి చేద్దామనే ఉద్దేశంతోనే వున్నాం. ఏవో చాలా సంబంధాలు వస్తూనే వున్నాయి. కాని అనేక కారణాల వల్ల యెటూ తేల్చలేకపోయాను. కొందరు కుర్రాళ్ళని మే మెవరమూ యెరగం. కొందరు మన స్టేటస్‌కు తగిన వాళ్ళనిపించలేదు. కొందరికి డబ్బయితే వుందిగాని, తగినంత సంస్కారం లేదు. కట్నాలడుగుతారని భయం నాకు లేదు. అడక్కపోయినా నా తాహతుకు తగినట్టు నే నిచ్చితీరతాను. లేదూ, పై దేశాలకు వెళ్ళి క్వాలిఫై అయివస్తానన్నా సాయంచేస్తాను. నా అభిప్రాయాల కనుగుణంగా ఇదివర కెవ్వరూ దొరకలేదు. అదివరకే మా రాఘవుడు నిన్నుగురించి చెప్పాడు. మేం సావిత్రి పెళ్ళి ప్రసక్తి యెత్తినప్పుడల్లా రాఘవుడు నీ పేరెత్తాడనుకో. కాని కంటితో చూడని కుర్రాణ్ణిగురించి యేమీ నిర్ణయించలేకపోయాను. లకీగా ఇవాళ చూచాను. లోపలికి వస్తూనే మీ ఇద్దర్ని పక్కపక్కనే చూసి నాలోనేను యెంత సరిఅయిన జోడు అనుకున్నాను. నాకు దాపరికాలు తెలీవు. నిన్ను సావిత్రీ, నా భార్యా నాకన్న ముందే చూశారు. నా వుద్దేశంమటుకు, ఇతర అభ్యంతరాలేమీ లేకపోతే మీ రిద్దరూ పెళ్ళాడటం అన్నివిధాలా బాగుంటుందని. నిన్ను నేనేమీ తొందరచెయ్యను. ఇంకో యేడాదికి పెళ్లయినా నా కభ్యంతరం లేదు. కాని ఈ ఉద్దేశం మనసులో వుంచుకుని ఆలోచించు. మా ఫామిలీ అంతా నాతో యేకీభవిస్తుందనుకుంటా.

సుశీ : ఇదుగోనండీ మీ కాఫీ. ఇంకో కప్పు తాగుతావా, రంజన్.

రంజ : కొంచెంగా ఇవ్వండి.

సుశీ : ఏమండీ. ఈ పూట నా కాఫీ బాగా లేదంటే ఒప్పుకునేది లేదు. రంజన్‌కు నా కాఫీ నచ్చిందిట. ఏమిటి యేకీభవించ మంటున్నారు ?

చంద్ర : రంజన్‌ని చూడగానే నాకు సావిత్రిని అతను చేసుకుంటే ఈడూ జోడుగా ఉంటుం దనిపించింది. ఆలోచించుకొంటున్నాను.

సుశీ : మీ కనిపించట మేమిటి ? కళ్లున్నవాళ్లందరికీ అలాగే అనిపిస్తుంది. అతనేం పసిపిల్లవాడుటండీ ? అంతమాత్రం ఆలోచించుకోలేడూ ?

రాఘు : అవును. అతను మన సావిత్రిని ఒక్కత్తెనే చూశాడా యేమిటి ? అవతల సరోజవాళ్లింటికొచ్చాడు. సరోజను రంజన్ చేసుకుంటే బాగుండునని వాళ్లమ్మకు అనిపిస్తుంది.

సావి : నీది మరీ చోద్యం అన్నయ్యా, నువ్వు అక్కర్లేదన్న సరోజను ఆయన దేనికి చేసుకోవాలీ ?

సుశీ : బాగా చెప్పావు, తల్లీ! యేంరా రాఘువా ? నిన్ను సరోజను చేసుకోమని కాళ్లా వేళ్లా పడలా వాళ్లూ ? చేసుకోకపోయావా ?

రాఘు : ఏవో అవాంతరాలుంటాయి.

సావి : అందరికీ అంతే అనుకోరాదూ.

రంజ : చీకటిపడుతోంది. ఇక నేను బయలుదేరాలి.

సుశీ : (ఆశ్చర్యంతో—) ఎక్కడికి ?

రంజ : నాకోసం శ్రీనివాసరావుగారు కనిపెట్టుకుంటారు.
సుశీ : అదేమిటి నాయనా, నువ్వీపూట యిక్కడే భోంచేద్దువు గాని. ఈపూట పార్టీవుందని చెప్పలేమురా, రాఘవా?
రంజ : పార్టీయా ?
సుశీ : అవును. అమ్మాయి పాసయిందనీ. పెద్ద ఆర్భాటం యేమీలేదు. దాని ముఖ్య స్నేహితురాళ్లని ముగ్గురినో నలుగురినో పిలిచింది.
రంజ : నాకు తెలీదు. అలాగే భోజనానికుందునుగాని వాళ్లు నా కోసం కనిపెట్టుకుంటారేమో!
సావి : సరోజకూడా వస్తున్నదిలెండి. నాకోసమైనా వుండి పోవాలి.
సుశీ : నేను పోతున్నాన్రా. వంటావిడ యేంచేస్తోందో చూడాలి. మనుష్ఖుల్ని పెట్టుకున్న సుఖంలేదు కద! వెనకడితే వుండి చూడకపోతే ఏదో ఒకటి పాడుచేస్తారు.
చంద్ర : రాఘవా, ఒక్కమారు కిందికిరా. చిన్న విషయం.
సావిత్రి : ఏమండీ, మా ఆతిథ్యం మీ కంత రుచించినట్టులేదు.
రంజన్ : ఎందు కలా అనిపించిందీ ?
సావి : దీపాలు వెలుగుతూనే మీకు వెళ్ళిపోవాలనిపించిందే. ఇంకేం సాక్ష్యం కావాలీ ?
రంజన్ : ఓ, అదా. నాకొక విచిత్రమైన అంతరాత్మ నిచ్చాడు భగవంతుడు. నిష్పూచీగా ప్రవర్తించలేను. నేనీపూట ఇక్కడ వున్నానని శ్రీనివాసరావుగారికి, నేను భోజనానికి రావటంలేదని ఆయన బంధువులకీ తెలిస్తే నా అంతరాత్మ నిశ్చింతగా వుంటుంది.

సావి : ఒకరి అనుజ్ఞ లేకుండా మీరు ఒకపూట మీ యిష్టం వచ్చినచోట భోజనం కూడా చెయ్యలేకన్నమాట ?

రంజన్ : అలాగేననిపిస్తుంది. ఇందుకు నన్ననేకమంది వెట కారం చేశారు. అదిపరకొకసారి ఇలాగే నాకొక సంబంధం వస్తే మా నాన్నగారితో మాట్లాడమన్నాను.

సావి : (ఆశ్చర్యంతో) నిజం ?

రంజన్ : ఆశ్చర్యంగా ఉందా ?

సావి : ఆశ్చర్యంకాదా ? అప్-టు-డేట్ యంగ్‌మాన్ తండ్రి అనుమతితో పెళ్ళాడటమంటే.

రంజన్ : నిజంగా అవసరంవస్తే తిరగబడవచ్చు. కాని అయిన దానికీ కానిదానికీ తిరగబడి, నేనెంత స్వతంత్రుణ్నో చూడండి...అని డప్పు వాయించుకోవాలా ?

సావి : మీ యిష్టం...కాని, సరితాదేవిగారింటి విశేషాలు చెప్పారుకారు. మీకెలా అనిపించిందోగాని; నా కాపిడ ఫన్నీగా కనిపిస్తుంది.

రంజన్ : నేనేమంత గమనించలేదు. పొద్దున నువక్కడ వుండ గానే వచ్చాముగా ? భోజనంచేసి బయలుదేరాం. ఆ ఇంటి వాళ్ళతో సరిగా పరిచయంకూడా కాలేదు.

సావి : (స్వగతం పైకి అనేస్తున్నట్టుగా) పాపం, సరోజ చదు వులో సున్నా అయినా, ఇతర విషయాల్లో మంచిదే. అయితే తల్లినిచూసి పిల్లను చేసుకోవాలనే సిద్ధాంతం అందరూ పాటిస్తే, సరోజకీ జన్మలో పెళ్ళికాదు.

చూస్తాం. అయితే అందరికీ అందమైనవాళ్లూ, చదువుకున్న వాళ్లూ, డబ్బున్నవాళ్ళూ, బుద్ధిమంతులూ దొరుకుతారా ? దొరకరు మనబుద్ధికితగ్గట్టు మనం రాజీపడతాం. రాజీపడక ఎట్లాగూ తప్పదు. కాని పిల్ల కిష్టమైనట్టుగా రాజీపడటం ధర్మం. అవునంటావా, కాదంటావా ? ఇంకా నాలుగేళ్లు పోయినాక సత్యవతి ఒక కవిని పెళ్ళాడతాననవచ్చు, ఒక పాట గాణ్ణి పెళ్ళాడతాననవచ్చు. ఏ రాజకీయ నాయకుడో, నటుడో, సినిమాస్టారో దానికి దొరకవచ్చు. దానిబుద్ధి ఎట్లా వికసిస్తుందో మనం ఇప్పుడెట్లా చెప్పగలం ? ఇవాళ మనం దానికిచూసే సంబంధాలు వేరు, మరో నాలుగేళ్ళకు దానికి దొరికే సంబంధాలు వేరు.

అమ్మ : ఆమాటన్నావు, బాగుంది ! ఇప్పుడున్న నాలుగు సంబంధాలూ జారవిడిచామంటే ఇకముందు దానికి ఎటువంటి సంబంధాలు రావాలో అటువంటివే వస్తాయిలే ! నోళ్ళు తెరుచుకూర్చోండి. ఎవరికీ తొందర లేకపోతే నాకొక్కత్తెకే వచ్చిందా ఏమిటి ?...

# 2

ఈ దోరణిలో ఇంకా చర్చలు జరిగాయి. దాదాపు రోజూ భోజనాలదగ్గర ఇదే. క్రమంగా అమ్మకూడా వాళ్ళ వాదనలు అర్ధంచేసుకుని నా పెళ్లి వాయిదా వెయ్యటానికి ఒప్పుకుంది. ఏ పదిహేనో ఏటనో నాకు పెళ్లి జరిగితే కలిగే లాభాలు మా అన్నలు అంచనాకట్టారు...

పెద్ద అన్న : ఎటువంటి మొగుడితో తను సుఖంగా కాపరంచెయ్యగలుగుతుందో దానికే తెలిసివస్తుంది. మన అభిప్రాయాలతో పని ఉండదు.

రెండో అన్న : ఎక్కువ సంస్కారంగలవాళ్ళు దాన్ని చేసుకోవటానికి ముందుకొస్తారు. జీవితంలో స్థిరపడ్డవాళ్లూ, రంగు తేలిపోయినవాళ్ళూ వస్తారు. ముందు ముందు ఎట్లా ఉండబోతారో అనే అనుమానం ఉండదు.

మూడో అన్న : దాన్ని చేసుకునేవాళ్లు మనిషినిచూసి మరీ చేసుకుంటారు. "పెళ్లి నాటికి బాగానే ఉంది. ఈడొచ్చి నాక చెడిపోయింది," అని ఏడవటానికి అవకాశం ఉండదు...

ఇదంతా నాకూడా నచ్చింది. అప్పటివరకూ పెళ్లాడ టానికి సిద్ధంగా ఉన్నదాన్ని కాస్తా, ఈమాటలు నమ్మి పెళ్ళిని గురించి పగటి కలలు కన నారంభించాను. నా పెళ్ళి కనీసం నాలుగైదేళ్లు వాయిదాపడింది కనక ఈలోపుగా నే కేంబ్రిడ్జి సీనియరుగాని, అథమం బెనారస్ మెట్రిక్యులేషను పాసు కావాలని మావాళ్ళు తీర్మానించారు. మా పెద్దన్న నాకోసం ఒక ప్రైవేటు మాష్టర్ని కూడా కుదిర్చాడు. ఆ పేరు చలపతిరావు. మా పెద్దన్నా ఆయనా కలిసి చదువు కున్నారు. ఆయన పాపం! బీదవాడు. బియ్యే పాసయాడు. భార్యా ఇద్దరుపిల్లలూ ఉన్నారు. ఉద్యోగం లేదు. మావూళ్ళో హైస్కూల్లో నియోగి వైదీకతగాదాల్లో రెండుసార్లు ఉద్యోగ మిచ్చి రెండుసార్లూ తీసేశారు. నాకు ప్రైవేటు చెప్పినందుకు మావాళ్ళు పది రూపాయ లిచ్చేవారు. అది ఎక్కువో

చ్చేట్టు! ఎన్నో సంబంధాలొచ్చాయి. పిల్లను చూసి అందరూ తిరుగుమొహం పెట్టారు.

పెద్ద అన్న : అదికాదమ్మా, శారదాబిల్లంటే అంగడిలో కూరలనుకున్నావా, ఇష్టమైతే కొని లేకపోతే మానటానికి? అది చట్టం. దానిప్రకారం చేసితీరాలి. పధ్నాలుగేళ్ళలోపు పిల్లలకి పెళ్ళిచెయ్యటం నేరం. తెలిస్తే జైల్లో వేస్తారు జుల్మానా వేస్తారు.

అమ్మ : అదో పాపఖర్మకూడానా?

రెండో అన్న : అదంతా వొట్టిదిలే, అమ్మా. శారదా చట్టం అంతబాగా అమలుజరగటం లేదులే. అది సరిగా అమలు జరగటం పెద్దవాళ్ళకే ఇష్టంలేదు. అందుకనే ఎవరిఇష్టం వచ్చినట్టు వాళ్ళు పెళ్ళిళ్ళు చేస్తున్నారు మనం ఆలోచించవలసిన విషయం అదికాదు. మన ఆడపిల్లలు వాళ్ళ పెళ్ళిళ్ళు వాళ్ళే చేసుకునేటందుకు అవకాశం ఉన్నప్పుడు మనమెందుకు చెయ్యాలంట! మన సత్యవతి దాని మొగుణ్ణి అదే వెతుక్కుంటే బాగుండదూ?

అమ్మ : అదెక్కడ వెతుక్కుంటుందిరా? మనకన్న బాగా వెతుకుతుందా? లక్షణంగా పిల్లకు మంచిమొగుణ్ణి చూసి పెళ్ళిచేస్తారా? లేక, దాన్ని వీధిలోకి పంపించి "నీ మొగుణ్ణి నువ్వే వెతుక్కో, నువ్వే పెళ్ళిచేసుకో," అంటారా? ఏం మాటల్రా?

మూడో అన్న : వెతుక్కోనటమంటే వీధులవెంబడి తిరగటంటమ్మా? మనం తెచ్చిన సంబంధాల్లో దానికేది నచ్చితే అదే ఏరుకుంటుంది. అదీ శారదాబిల్లువల్ల లాభం.

అమ్మ : చెప్పావులేవోయ్ ! ఇప్పుడు మాత్రం దాని కిష్టంలేని సంబంధం చెయ్యబోతున్నామా ఏమిటి ? అసలు అంత పనికిమాలిన సంబంధం మన మెందుకు చేస్తాం? మనలో మన కంత నమ్మకం ఎందుకు లేకుండా పోవాలి ?

రెండో అన్న: తల్లిదండ్రులు ఎంత మంచివాళ్ళయినా వాళ్ళ కెటువంటి సదుద్దేశాలున్నా, కొన్ని కొన్ని విషయా లలో పిల్లలజీవితం గురించి వాళ్ళు నిర్ణయాలు చెయ్యలేరు.

అమ్మ : ఉపన్యాసం చాల్లే. కన్న పిల్లకి మొగుణ్ణి వెతకటంకూడా మాకు చాత కాదంటావా ఏమిటి ? అదివర కల్లా ఈశారదాబిల్లు లేదే, పిల్లల పెళ్లిళ్ళు ఎవరు చేశారు ? ఈ బిల్లు రాగానే పెద్దవాళ్ళకి ఏమీ చాతకాకుండాపోయింది కామాలు !

పెద్ద అన్న: అట్లాకాదు లేవమ్మా, నేను నా పెళ్లాంతో ఎట్లా కాపరం చెయ్యాలో నువ్వు చెప్పగలవా ? నీవల్లకాదు నీకెంత తెలివి తేటలుండనీ, ఎంత మంచిదానివి కానీ, నా కాపరం ఎట్లా చెయ్యాలో నేను తెలుసుకోవలిసిందే. కాకపోతే నేను సరిగా చెయ్యకపోతే నువ్వు సరిదిద్దొచ్చు. అంతకంటె నువ్వేం చెయ్యగలవు ?

అమ్మ : కాపరం చెయ్యటం సరే అనుకో. పెళ్ళి చెయ్యటానికేం ?

పెద్ద అన్న : కాపరానికి పెళ్ళేగాదుటమ్మా మొదటి మెట్టూ ? అసలు ఒకరి పెళ్లి ఇంకొకరు చెయ్యటమే పొర పాటు మనం అందమైనవాళ్ళని చూస్తాం, చదువుకున్న వాళ్ళని చూస్తాం, డబ్బున్న వాళ్ళని చూస్తాం, బుద్ధిమంతుల్ని

క్షణంలో సంబంధం దొరుకుతుంది. ఆపైన దాని మొగుడి క్రిష్టమైతే చదివించుకోనీ. ఒక్క ఏడాది మానేస్తే ఇంతలో చదువు చెడిపోదు, దానికి ఈడు మించిపోదు...

# 3

కాని నాన్న అనుకున్నట్టు జరగలేదు. నా చదువేమో అక్కడితో మొండిపడిపోయింది. నాకు పెళ్ళి సంబంధాలు నాన్న అనుకున్నంత సులభంగా దొరకలేదు. ఏవో వచ్చాయి కానీ వాటిలో చాలాభాగం నాదాకా రాకమునుపే మా అమ్మా, నాన్నా, మా అన్నయ్యాలో కొట్టిపారేస్తూ వచ్చారు. నాకుచూసే సంబంధాల్లో ఏపాటిలోపంఉన్నా మావాళ్ళు మొదట్లో సహించేవారుకారు.

ఇట్లా కొంతకాలం గడిచింది. నాకు మంచిసంబంధాలిక రావనీ, వచ్చే సంబంధాలు మగవాళ్ళు పడనివ్వరనీ, ఇట్లాగే ఇంకా రెండేళ్ళు గడిస్తే నాకిక అసలుపెళ్ళేకాదనీ మాఅమ్మ లోలోపల తగని భయపడసాగింది. ఎప్పుడన్నా పట్టలేక ఆవిడ ఒక్క ఆమాట అనేస్తే మగవాళ్ళు ఆవిణ్ణి గట్టిగా కోప్పడేవారు!

నామటుకు నాకెందుకో పెళ్ళినిగురించి అదివరకులాగా ఆలోచించటానికి ఏమీ ఇష్టంలేకుండాపోయింది. మరీ వచ్చే సంబంధాలు నన్ను చేసుకుంటామని వచ్చినప్పుడు, వచ్చినా జన్మలో పెళ్ళి చేసుకోరాదనిపించేది. చివరకు కూరలబేర గాళ్ళుకూడా వాళ్ళ వస్తువులను మనం మరీ చౌకగా అడిగితే సంహించరే. నన్ను పరమ నాసిరకంవాళ్ళు పెళ్ళాడతామని

వస్తే నాకెట్లా ఉండాలి?...ఒక్కొక్కసారి నాలో నాకు నమ్మకం పోయేది. అంతకంటే మంచి సంబంధాలు రావేమోననిపించేది. ఈ నా భయాన్ని మా అమ్మ చాటుగా బలపరిచేది. ఒకరోజు నేనీ విషయమే ఆలోచించుకుంటూండగా...

( తలుపు చప్పుడు )

సత్యవతి : ఎవరు వారూ ?

చలపతిరావు : నేను, చలపతిరావును.

సత్యవతి : మీరేనా...వస్తున్నా నుండండి. ( వెళ్ళి తలుపు తీస్తుంది. )

చలపతిరావు : ఏం, సత్యవతీ! ఒక్కర్తెవూ కూర్చుని ఏదో చదువుకుంటున్నట్టున్నావే! నాన్నగారు లేరా?

సత్యవతి: లేరండీ...కూర్చోండి! ఏమిటి విశేషం

చలపతిరావు : విశేషమేముందిలే...ఎప్పుడు పెళ్ళి మాకు చప్పన పప్పుధప్పళం పెట్టించు మరీ!

సత్యవతి : అంత చప్పన జరిగేటట్టు లేదు.

చలపతిరావు : ఏవో సంబంధాలు చూస్తున్నారుటగా?

సత్యవతి : చూడటానికేం? చూస్తూనే ఉన్నారు..

చలపతిరావు : నీ కేపీ నచ్చలేదా ఏం ?

సత్యవతి : నాకా? ( నవ్వుతుంది )

చలపతిరావు : ఏమన్నా అన్నానా ?

సత్యవతి : మీరన్నదానికి నవ్వలేదు. మరేదో జ్ఞాపకంవచ్చి నవ్వాను.

చలపతిరావు : ఏమిటో అది?

తక్కువో నాకు తెలీదు. కాని నా చదువుకోసం ఆయనపడ్డ శ్రమ డబ్బిచ్చి ఎవరూ కొనేదికాదు. నాలుగేళ్ళు ఆయన పడ్డ శ్రమ ఫలించి నేను బెనారస్ మెట్రిక్ మంచి మార్కులతో పాసయ్యాను. మావాళ్ళందరికీ అపరిమితానందం కలిగింది. ఇక నా సంతోషానికి మేరేలేదు. ఇన్నాళ్ళూ నేను చలపతిరావు గారి ధర్మాన చదువు తప్ప ఇంకోవిషయమే ఆలోచించలేదు. కాని అది అయిపోగానే పెళ్ళివిషయమై నేను వెనకకన్న పగటి కలలు మళ్ళీ తిరిగివచ్చాయి. నన్ను పెళ్ళాడటానికి ఐ. సి. ఎస్సులూ, జిల్లా కలెక్టర్లూ, జడ్జీలూ ముందుకొస్తా రనుకున్నాను. కాని ఆమాట నాకే నమ్మశక్యంకాలేదు. ఈ నాలుగేళ్ళలోనూ, ఈ బెనారస్ మెట్రిక్ వల్ల నాలో అంత గొప్పమార్పు వచ్చిందా ? అసలు ఏ మార్పయినా వచ్చిం దనుకోవటమే నాకు సాధ్యంకాలేదు. పెద్ద చదువు చదివా ననిపించుకోవాలంటే కనీసం బియ్యే అయినా పాసుకావాలి. నగవలిసింది నా పెళ్ళి, చదువా అనేది ఒకనాడు చర్చకు చ్చింది...

పెద్ద అన్న : ఏం, నాన్నా సత్యవతిని కాలేజీలో ప్రవేశపెట్టొద్దూ ?

నాన్న : అది చదువుకుంటాననుంటుందా, పెళ్ళిచేసు ంటా నంటుందా? చదివిన చదువు చాలదూ? ఉద్యోగాలు చేయాలా, ఊళ్ళేలాలా? పెళ్ళాడి పిల్లల్ని కనటానికింకా పెద్ద చదువు లెందుకూ?

రెండో అన్న : చదువంటే అణా పైసలల్లే లెక్కచూస్తా వేఁవిటి, నాన్నా? అనగానే పెళ్ళయిపోయిందా ఏం? చదు

వుతూ ఉంటుందీ; ఏనాడు పెళ్ళయితే ఆనాడే మా నెయ్యో మూ్చ: మొగుడు చదువుకో నిస్తానంటాడా, మరీ మంచిది!

నాన్న : అది సరేరా. చదువుకోవాలంటే ఊళ్లో ఉన్న కాలేజీకన్న వేరేలేదు గదా. దీన్నిప్పుడు ఆడపిల్లల కాలేజీకోసం ఏ పట్నమో ఎక్కడ పంపిస్తాం? దీన్ని...మొగ పిల్లల కాలేజీలో చేరిస్తే...

మూడో అన్న : ఆ మాట నిజమే, నాన్నా. మన కాలేజీలోవాళ్ళు బొత్తిగా కోతిమూక. జూనియర్ క్లాసులో ముగ్గురాడపిల్లలున్నారా, ముగ్గుర్నీ మా మొగపిల్లలు రోజుకు మూడేసి చెరువుల నీళ్ళు తాగిస్తున్నారనుకో. ఛీ, వాళ్ళ దుంప తెగా. ఒకమ్మాయి అన్న మా క్లాసులోనేఉన్నాడు. వాడికి రోజూ చచ్చింది చావు కాకుండా ఉంది.

పెద్దన్న : కాలేజీ కుర్రాళ్ళు అంతో ఇంతో అల్లరి చెయ్యకుండా ఉండరుగాని, ఆడపిల్లల్లో ఏదో లోపం లేంగే మితిమీరిపోరు.

రెండో అన్న : సత్యవతి కాలేజీలో చదవటం నాకూ ఇష్టమేగాని దాన్ని కాలేజీలో ఎవరన్నా పల్లెత్తుమాటన్నారా, నే నూరుకునేదిలేదు. నెత్తురు కక్కిచ్చేస్తా, ఒక్కొక్క వెధవన్ పట్టుకుని.

మూడోవాడు : అందరూ అందరే అయితే ఎవర్ని నెత్తురు కక్కిస్తావు. ఎందుకీ కానిపోనిమాటలు ?

నాన్న: (అనుమానంగా) ఏమోరా. మీరంతా దాని చదువువిషయంలో పట్టుదలగా ఉన్నారుగానీ...నాకేమంత నచ్చలేదబ్బా! పెళ్ళిచెయ్యాలనుకుంటే బ్రహ్మాండమా ఏమిటి?

సత్యవతి : ఏమీలేదు, అయిదారేళ్ళ కిందట మా వాళ్ళు నాకు పెళ్ళి చేతామనుకుని మానేశారు. ఎందుకూ, పెద్దదాన్నయినాక పెళ్ళిచేస్తే ఎటువంటి మొగుణ్ని ఏరుకోవాలో నాకు తెలుస్తుందనీ, అప్పుడు నా మొగుణ్ని నేనే స్వేచ్ఛగా ఏరుకుంటాననీ, ఏరుకోవటానికి నాకు భలే మంచి మొగుళ్ళు దొరుకుతారనీనూ! ఆలోచిస్తున్నాను, ఈ మూడింటిలో ఒక్కటీ జరగలేదు.

చలపతిరావు : అంటే, నీకు కావలసిన మొగుణ్ణి ఏరుకోలేకుండా ఉన్నావా ?

సత్యవతి : ఎటువంటి మొగుణ్ణి ఏరుకోవాలో కూడా నాకు తెలీటంలేదు. అయిదారేళ్ళ కిందట తెలిసినంతకూడా ఇప్పుడు తెలిసినట్టు కనబడటంలేదు. చిత్రంగాలేదూ ?

చలపతిరావు : అదివరకు మనుషుల్ని ఆమోదించినంత సులభంగా ఇప్పుడామోదించలేకుండా ఉన్నావు. అంతకంటె మరేమీలేదు.

సత్యవతి : ఏదన్నా కానివ్వండి, నా సంబంధాలు ఇప్పుడుకూడా మావాళ్లే చూస్తున్నారు. వెనకటికీ ఇప్పటికీ ఏమిటి తేడా ? మా అమ్మనడిగితే వెనక నాకు మంచి సంబంధాలు వచ్చాయంటున్నది. నిజమేనేమో కూడానూ.

చలపతి : చూడు, సత్యవతీ. నువ్వు భ్రమపడకు. నీకు నీ యీడు మగపిల్లలతో కలిసి స్వేచ్ఛగా తిరిగే అవకాశం ఉంటే తప్ప నీ భర్తను నువ్వు ఏరుకోలేవు. మీ వాళ్ళు ఇప్పటికైనా నీకా స్వేచ్ఛ ఇవ్వాలి; లేదా, వాళ్ళే నీకు సంబంధం చూడాలి.

సత్యవతి : నన్ను కాలేజీలో ప్రవేశపెట్టటానికే మా వాళ్ళు దడదడలాడారు—మగపిల్లలతో చదవటమా అని. నాకు కావలిసినవాణ్ణి నేను చూసుకునేదేమిటి, చేసుకునేదేమిటి ? పోనీ వాళ్లు తెచ్చిన సంబంధాలే చేసుకుందామంటే, చేసుకుంటానని వచ్చే మనిషిని గురించి ఏమీ తెలియదే అని పిస్తుంది. అన్నీ అనుమానాలే ! ఈ సమస్య ఎట్లా పరిష్కార మవుతుందండీ ?

చలపతి : చెప్పటం కష్టం. ఆడపిల్లలకు ఇప్పుడున్న స్వేచ్ఛతో ఇంతకంటె మంచిపెళ్ళిళ్ళు జరగటం కష్టమే నేమో !

సత్యవతి : ఏమోనండీ, నాకు ఈ సంస్కారంమీదే విశ్వాసం పోతోంది. చిన్నపిల్లల హృదయాలతికినట్టుగా పెద్ద వాళ్ళ హృదయాలతుక్కుంటాయా ? చిన్నతనపు పెళ్ళిళ్లే మంచివేమో ?

చలపతి : నేనామాట నమ్మలేను. పెద్దవుతున్నకొ మనుషుల హృదయాలలో ఎటువంటి పరిణామం కలు తుందో చెప్పలేం. నాపెళ్ళి అయినప్పుడు నాకు తగని పెళ్లాన్ని అంటగట్టా రనుకున్నాను. కాపరానికి వచ్చిన కొత్తలో నా భార్యని చాలా అమానుషంగా చూసేవాణ్ణి. కాని ఆవిడ ఎంత ఓర్పుతో నా దరిద్రం పంచుకుంటున్నదీ చూస్తున్నకొద్దీ నా హృదయం చాలా మెత్తబడిపోయింది. డబ్బుకన్న విలు వైనది ప్రపంచంలో లేదనుకోవలిసిన స్థితిలో ఉండికూడా, మా ఆవిడ ఓర్పుకంటె విలువైనదిలేదని మనస్ఫూర్తిగా నమ్ము తున్నాను.

సత్యవతి : (తనసంగతి మరచిపోతూ) పాపం, ఆవిడకి ఒంట్లో సరిగా లేదుటగాదూ ?

చలపతి : లేదు, సత్యవతి. సరిగా తిండి ఉంటేగా? చిక్కి శల్యమైంది. ఏరోజున మంచాన పడుతుందో అన్నట్టుంది. డాక్టర్లనడిగితే ఇంజెక్షన్లిస్తామంటారు. టానిక్కులిప్పించమంటారు. ఎక్కణ్నించి తీసుకురాను? అంట్లుతోమే మనిషినికూడా పెట్టించలేను. పైన ఆ పిల్లలు! వాళ్ళకీ చీటికి మాటికీ రోగాలూ!

సత్యవతి : పాపం!—

చలపతిరావు : పనివేళ నే నిదంతా నీకు చెప్పుకుంటున్నా నెందుకు?...పోతాను, సత్యవతి! మీ నాన్నగారిని మళ్ళీ వచ్చి చూస్తాలే.

సత్యవతి : తొందర పనా? చెప్పండీ?

చలపతిరావు : ఇంకేముందీ, పది రూపాయలు బదులిస్తారేమోనని.

సత్యవతి : ఆపాటి మా అమ్మదగ్గర లేకుండా ఉంటుందా? ఒక్కక్షణం ఆగండి...

## 4

మా అమ్మ పదిరూపాయలూ ఇచ్చింది. కాని చాలా నసిగింది. చలపతిరావుకిస్తే తిరిగి ఎట్లా వస్తుందన్నది. ఒకసారి ఇస్తే మళ్ళా వస్తాడన్నది. ఆదినిష్ఠూరం మే లన్నది. లేదని చెప్పమన్నది.

ఆవిడ కృతఘ్నత చూస్తే నా కాశ్చర్యం వేసింది. మా వాళ్ళిచ్చిన ముష్టి పదిరూపాయల నెలజీతాని కాయన నాకు ఎంత శ్రద్ధగా చదువు చెప్పాడు! తన చెల్లెలికో కూతురికో చెప్పవదానికన్న శ్రద్ధగా చెప్పాడే! నేను పాసయి సంతోషిస్తున్న సమయంలో తన కా పదిరూపాయల రాబడికూడా పోయిందని ఆయన ఎంత విచారించి ఉండాలి?

మా అమ్మను చూస్తే నాకు అసహ్యం వేసింది. మా నాన్న ఇంటికివచ్చి చలపతిరావుగారిని గురించి దాదాపు మా అమ్మ అన్నట్టే అన్నాడు. ఆయనమీదకూడా నాకు అసహ్యం పుట్టింది. వాళ్ళిద్దరూ నాకు కొత్తమనుషుల్లే కనపడసాగారు. వీళ్ళింత మారిపోతున్నారేమా అనుకున్నాను. కాని రాను రాను మార్పు నాలోనే కలుగుతున్నట్టు తోచింది.

వాళ్ళు మారలేదనికాదు. నా పెళ్ళి విషయంలో క్రమంగా మా నాన్న మా అమ్మతో ఏకం కాసాగా...

అమ్మ : మీరిట్లా ఇంకా ఎంతకాలం కళ్ళుమూసకూర్చుంటారండీ?

నాన్న : నన్నేం చెయ్యమంటావే?

అమ్మ : వెనక నేను, పెళ్ళిచెయ్యండి అని నెత్తీ నోరూ కొట్టుకుంటే నామాట విన్నారుకారు. ఇప్పటికైనా వినండి. లేకపోతే అనుభవిస్తారు.

నాన్న : (విసుగ్గా) ఏమిటే ఇప్పుడు నువ్వనేదీ?

అమ్మ : దానికి ఏదో సంబంధంచూసి ముడిపెట్టండి.

నాన్న : ఇప్పుడు చూడకుండా కూచున్నానంటే?

అమ్మ : చూస్తున్నారు! అడగక్కర్లేదు! మీ కే సంబంధమూ నచ్చదాయె. ఇంతోటి కూతురికి తగ్గమొగుడే ప్రపంచంలో లేడాయె. అసలు వాడు పుట్టాడో లేదో కూడా తోచకుండా ఉంది.

నాన్న: ఇహ ఆ పనే చేస్తాంలే. తప్పుతుందా ఏమిటీ?

అమ్మ : వెనకే నామాటవిని పెళ్ళిచేసుంటే ఎంత మంచి సంబంధాలొచ్చాయి! ఆ సూరవరం కుర్రాడు అయిదొందలు సంపాదిస్తున్నాడు.

పెద్దన్న : అవును. పెళ్ళాన్ని పుట్టింటికి పంపినప్పుడల్లా అత్తవారు అయిదువందలు కక్కితేగాని తిరిగి తెచ్చుకోడు. వాడి సంపాదనమీద రెండు బోగంకుటుంబాలు నిక్షేపంగా తుకుతున్నాయి.

రెండో అన్న : నువ్వుకూడా అమ్మతో చేరావులే, నాన్నా! మీ ఆచుర్దాకొద్దీ సత్యవతికి ఏదో సంబంధం ముడి పెట్టేస్తే నేను చూస్తూ ఊరుకోను. తరువాత మీ యిష్టం!

నాన్న : అంత ఆపేక్షగలవాడివి దానికి మంచి సంబంధం పట్రా. ఎవరొద్దన్నారూ? ఈపాటి ఆపేక్ష అంతఃకరణలు నాకూ మీ అమ్మకూ లేకనేనా?...

ఇటువంటి సంభాషణలు వినటం నాకదివరకు సంతోషంగా ఉండేది. నన్నుగురించి, పాపం! వీళ్ళెంత శ్రద్ధతీసుకుంటున్నారుగదా అనిపించేది. వాళ్ళ ఆవేదన నన్ను గురించి కాదని నాకిప్పుడు తెలిసిపోయింది. మా అన్నల కబుర్లుకూడా నాకు వట్టి ప్రగల్భాలుగా కనిపించ సాగాయి.

ఈ సంభాషణల్లో నాకు ఆసక్తి పోవటానికి మూడొంతులు కారణం నాకు పెళ్ళి వద్దని నిశ్చయించుకున్నాను. నేను పెళ్ళిచేసుకో దలుచుకుంటే ఒక్కడే ఉన్నాడు. ఆవిషయంలో నాకు సందేహామేమీ లేకుండా పోయింది. అతనికి పెళ్ళయింది. ఇద్దరు పిల్లలు. చెప్పరాని దరిద్రంలో మునిగి తేలుతున్నాడు. అటువంటివాణ్ణి నే నెట్లా పెళ్ళాడుతాను.

ఆయన అన్నమాట అక్షరాలా నిజమయింది. నా హృదయం వికసించింది. అతనిమీద నాకున్న కృతజ్ఞతేకాదు, అతని ఆలోచనలూ, అతని సమస్యలూ యదార్థమైనవి. మా అమ్మా నాన్నా లాగ కృత్రిమసమస్యలతో అతను బాధపడటంలేదు. అతను యదార్థమైన మనిషి. అందుచేతనే ఇంకొకరిని గురించి ఆలోచించగలడు. నేను నా పెళ్ళి విషయమై మానాన్నతోగాని అన్నయ్యలతోగాని అనని మాటలు అతనితో అన్నాను. అట్లా ఎందు కన్నానో నా కిప్పు డర్థమయింది.

ఈసారి నా కోసం ఆలోచించే సంబంధం మీద మా వాళ్ళు ఎక్కువ ఆసక్తి కనబరుస్తారని నాకు ముందుగానే తెలుసును. సరిగా అట్లాగే జరిగింది. ఒక సంబంధం వచ్చింది. అదివరకు మావాళ్లు చిన్నచూపు చూసిన సంబంధాలతో పాటిదేగాని ఘనమైనది కాదు. మా నాన్నా అమ్మా ఈ సంబంధాన్ని ఆకాశాని కెత్తేశారు. ఇటువంటి సంబంధానికే ఎవరో అయిదువేలు కట్నంపోశారన్నారు. మూడువేలు కట్నంపోసి ఈ సంబంధానికి నన్నివ్వటానికూడా సిద్ధపడ్డారు. నా అన్నలు కొద్దిగా సణిగారు, గొణిగారు, చప్పబడి ఊరు

కున్నారు. నేను అతన్నీ, అతను నన్నూ చూసుకోవటమే తరవాయి.

అతను సాయంకాలం అయిదింటికి వస్తాడని నన్ను మూడుగంటల నుంచే ముస్తాబు కమ్మన్నారు. పొద్దునే తలంటి పోసుకున్నాను. నాకు మంచి టిస్యూ చీరె కట్టబెట్టారు. నగలన్నీ తొడిగారు. మా అమ్మ నాకు పొదులు పొదులుగా జడ వేసింది. మూడున్నరకల్లా అలంకారం అయిపోయింది. ఇంకా గంటన్నరదాకా పెళ్లికొడుకు రాడు.

నా హృదయంలో ఎటువంటి చిచ్చు రగులుతోందో ఎవరికీ తెలీదు. అడుగడుగునా నాకు చలపతిరావే జ్ఞాపకం వచ్చాడు. కారణం చెప్పలేను. ఈ తంతు యావత్తూ అత నికి ద్రోహం చెయ్యటమే ననిపించింది. నన్ను ఒక్కత్తెనే ొదిలేసి ఎవరి పనిమీద వారు పోయినారు. అవును మరి. ికి స్వాగతమివ్వటానికి అందరికీ ఎడా తెరిపి లేని కార్యక్రమం;

నన్ను ఏమి ప్రేరేపించిందీ చెప్పలేను. ఎక్కడికి ున్నదీ తెలీకుండా నేను ఇల్లుదాటి వీధిలోకి వచ్చాను. ో అయిదునిమిషాల్లో నేను చలపతిరావుగారి ఇంటిదగ్గర న్నాను. వారిల్లు భీభత్సంగా ఉంది. వాళ్ళూ వీళ్ళూ చేరారు. ోపల డాక్టరున్నాడు.

చలపతిరావుగారి భార్య చచ్చిపోతోంది. నే నక్కడ ఎంతసేపున్నానో నాకప్పుడు తెలీదు. ఆవిడ పోయేసరికి రాత్రి తొమ్మిదిగంటలయింది. నే నా ఇల్లువొదిలి ఇంటికి వచ్చే సరికి పదిదాటింది. మా అమ్మ నన్ను చూస్తూనే...

అమ్మ : నీ యిల్లు నేలగట్టా! ఎక్కడికి కెళ్ళావే? (గట్టిగా అరుస్తోంది)

సత్యవతి : (హీనస్వరంతో) పాపం, చలపతిరావుగారి భార్య పోయారు.

అమ్మ : ఆపెద్దమనిషివచ్చి, కూచునీ, కూచునీ... ఏఁవిటీ? ఎవరు పోయారూ?

సత్యవతి : (నీరసంగా) చలపతిరావుగారి భార్యా, అమ్మా.

అమ్మ : ఎవరు చెప్పారూ?

సత్యవతి : నే నక్కణ్ణుంచే వస్తున్నా. నా చేతిమీది గానే పోయింది.

అమ్మ : (గుండె బాదుకుంటూ) అయ్యో, అయ్యో! నీకేవేం పొయ్యేబుద్ధులే? నిక్షేపమల్లే పెళ్ళికూతుర్ని చేస్తే వెళ్ళి శవజాగరం చేసొస్తున్నావా? పనివేళ నీకా చలపతిరా వెక్కడ దాపరించాడే! అభమూ శుభమూ లేకుండానూ!

సత్యవతి : (మాట్లాడటమే బాధగా ఉన్నట్టు) నాకు చలపతిరావుగారు దాపరించలేదమ్మా. నేనే ఆయనకు దాపరించాను. ఆయన పెళ్ళాం చావు బతుకుల్లో ఉండగా నేను అమ్మవారల్లే ఈ వేషంతో అక్కడికి వెళ్ళేసరికి ఆయన ప్రాణం ఎట్లా బాధపడి ఉండాలో!

అమ్మ : అసలు నువ్వక్కడి కెందుకు పోవలిసొచ్చిందో అది చెప్పవేం?

సత్యవతి : చలపతిరావుగారి భార్యా పోయారంటే నీకు చీమ కుట్టినపాటి లేదా, అమ్మా?

అమ్మ : పోతే ఏంచేస్తామే ? చలపతిరావు పెళ్ళాం పోయిందని పొద్దూకటం మానుతుందా? పాపం, ఆపెద్దమనిషి ఎంతసేపు కూచున్నాడు ! సిగ్గుపడిచచ్చాంగద ! ఏమని చెప్పం ? పాపం, ఆయన ఎంతో మంచిగా, "పోనీలేండి. రేపు మళ్ళీ వస్తాను," అన్నారు. అంత పెద్దమనిషితరహాగా ఆయన మాట్లాడుతుంటే మీ నాన్నకూ, అన్నయ్యలకూ ఏమనాలో కూడా తెలియలేదంటే నమ్మ.

సత్యవతి : ఇప్పుడేం మించిపోయిందమ్మా ? నే నాయన్ని ఎట్లాగూ పెళ్ళిచేసుకోబోవటంలేదు.

అమ్మ : అదేమిటేవ్ ? తెలిసి మాట్లాడుతున్నావా, తెలీక మాట్లాడుతున్నావా ?...

నేను చూడకుండానే సంబంధం వద్దన్నానని మా వాళ్ళందరికి కోపంవచ్చింది...

నాన్న : వద్దనగానే సరా ? సంబంధం చూడు. నీకేం నచ్చలేదో చెప్పు. నీఖయాలీతో మాపరువు తీసేస్తావా?

పెద్ద అన్న : అది కాదే, అమ్మాయ్. నీకు అతను నచ్చకపోతే, ఎందుకు నచ్చలేదనికూడా అడగం. అసలు చూడనే వద్దంటే ఎట్లా చెప్పూ ?

రెండో అన్న : నీకు పెళ్ళే అక్కర్లేకపోతే ముందు చెబితే ఇంతఘోరం రాకపోనుగా?

మూడో అన్న : అసలు ఇటువంటిదానికి సహాయ పడటానికి ప్రయత్నించటం మనదే పొరపాటు.

సత్యవతి : మీరంతా నన్నిన్ని ప్రశ్నలు అడక్కండి., అంతగా అయితే రేపాయనని చూసినాకనే నాకు పెళ్ళి

నాన్న : అట్లా తొందరపడతావేం ? అతన్ని పెళ్ళి చేసుకుని ఎట్లా బతుకుతావు ?

సత్యవతి : విశాలమైన ప్రపంచం ! ఎక్కడికైనా పోతాం. నా దగ్గిర వెయ్యి రూపాయల నగలున్నాయి. ఏదో ఒక ఉద్యోగం దొరక్కపోదు, ఈ దిక్కుమాలినఊరు వొదిలి పెట్టిపోతే !

నాన్న : నీ పద్ధతి నాకేమీ బాగాలేదు. నువ్వీ ఆలోచన మానుకో.

సత్యవతి: మీరే మీ పద్ధతులు మార్చుకోండి. నాపద్ధతులు మార్చుకోవలసిన అవసరం నాకులేదు. నేను పోతున్నాను. అందరికీ ఒక్క నమస్కారం !

*  *  *

[ఈ కథను గురించి కొన్నివిషయాలు విస్పష్టం చెయ్యటం అవసరం. ఇందులో చలపతిరావు భార్య చనిపోవటం సత్యవతిపెళ్ళికి అనుకూలిస్తున్నది. సత్యవతికి పెళ్లి అయేటట్టు చూడటమే కథకుడి ఆశయం అయితే, ఇంతకంటె చౌకబారు శిల్పం ఉండబోదు. కాని కథకుడి ఆశయం సత్యవతికి ఏదోవిధంగా పెళ్లిచేసెయ్యటంకాదు—సత్యవతి తనపెళ్లి నిర్ణయం తానే చేసుకుంటే ఆమెను ఎవరూ సమర్థరని రుజువుచేయటం.

ఒక్క సత్యవతి తల్లి మినహాయిస్తే, మిగిలినవారంతా సత్యవతిపట్ల అభ్యుదయకరమైన ఉద్దేశాలు ప్రకటించారు. చిన్నతనంలో తనకు పెళ్ళిచేసేస్తే సత్యవతి వద్దనేదికాదు.

కాని ఆమె జీవితంలో మరింత సంస్కారం కనపడాలని ఆమె తండ్రీ, తోబుట్టువులూ భావించారు. ఈ ఆశయం సఫలం కావటానికి అడుగడుగునా వారే అడ్డుతగిలారు. ఆఖరుకు సత్యవతి తల్లితో మిగిలినవారు కూడా సమానమై పోయినారు.

వారిదృష్టినుంచి సత్యవతి వివాహం యోగ్యమైనది కాదని పఠితలు నమ్మాలి. వాళ్ళు మరుద్దేశంతో ఆమె నిర్ణయాన్ని ప్రతిఘటించుతున్నారనుకోరాదు. కాని ఆమె తప్పు అందులో ఏమీలేదు. సత్యవతి ఒక మగవాణ్ణే సరిగా ఎరుగును. ఆమె హృదయం అతనివేపు మొగ్గింది మిగిలిన విషయాలు విచారించకుండా ఆమె అతన్ని పెళ్ళాడ నిర్ణయించింది. సమాజంతోనూ, ఇతర పురుషులతోనూ పూర్తిగా పరిచయం ఉంటే సత్యవతి చలపతిరావును పెళ్ళాడి ఉండేది కాదేమో!

సత్యవతి బంధువుల తప్పు ఆమెకు విరోధులు కావటం కాదు; తాము ఆచరణలో పెట్టలేని సిద్ధాంతాలను అవలంబించటం. ఆచరణకురాని ఆదర్శాలు ఈ నాటి సమాజంలో మధ్యతరగతిని జ్ఞానుల దృష్టిలో హాస్యాస్పదం చేస్తున్నాయి.

చలపతిరావు భార్య చనిపోక పోయినట్టయితే సత్యవతి ...బానికి తాము నమ్మె విశ్వాసాలను అనుసరించే శక్తి ...యాత్రమూ లేదని పూర్తిగా రుజువై ఉండదు.

—కథకుడు]

—:o:—

# కొరకరాని కొయ్య

## మొదటి రంగం

[ జయపురంలో పేదరాసి పెద్దమ్మ యిల్లు ]

పే. పె : (అడావుడిగా) ఒసే, మణికా! ఇంకా ఇంటిముందు కసువూడ్చి నీళ్ళుచల్లి ముగ్గువేయలేదు టే? అస్తమయ మవు తోందిగదా! అతిథులు వస్తారుగదా! దీపాలుపెట్టి ఇల్లు దిద్దుకోరు టే? (గుఱ్ఱపు డెక్కల చప్పుడు బయట ఆగి పోతుంది) అయ్యయ్యో, అనుకున్నంతా అయింది. వెలి గించు! వేగిరం దీపం వెలిగించు! (గొంతెత్తి) విజయీభవ, దిగ్విజయీభవ! దయచెయ్యండి! దయచెయ్యండి! మణికా! చెంబుతో నీళ్ళు, విసనకఱ్ఱ! కూర్చోండి, బాబూ! పేదయిల్లు! లోపాలెంచక మీ ఇల్లే అనుకోండి.

జయచంద్రుడు: మాది దూరదేశమవ్వా. సింహపురం. నాపేరు జయచంద్రుడంటారు. ఒకానొక కాలమందు మా ముత్తాత గారు ఈ నగరంలో నివసించారు.

పే. పె : వారి నామధేయం, నాయనా?

జయచంద్రుడు : మార్తాండవర్మాళిగారు.

పే. పె : (ఆనందంతో) చెప్పవేం, నాయనా! నాపసిఁ వారిని రెండుమార్లు కాబోలు చూశాను. కాలభైర- యం వెనుకగావుండే మిద్దెలో ఉండేవారు. ఏమి విగ్రహం! ఏమి ఠీవి!

జయచంద్రుడు : ఆ సంగతులేవీ నాకు తెలియ వవ్వా?

పే. పె : కాదామరి, నాయనా! ఆయన పోయేసరికి నేనే ఐదేళ్ళదాన్ని...ఇంతకీ నువ్వొన్నడూ ఇటుకేసి రాలేదల్లే వుంది. ఇప్పుడు రావటానికేదైనా విశేషం ఉందా ?

జయచంద్రుడు : (అనుమానంతో) ఉన్నది! కాని ఆలోచిస్తే, తీరావచ్చాక, యెండమావులవెంట వచ్చానా అనిపిస్తోంది. ఆసంగతంతా పోనీ అవ్వా.

పే. పె : నా కెందుకులే, నాయనా? ఇంతకీ నీకు పరిచితు లెవరైనా యీ జయపురంలో ఉన్నారా?

జయచంద్రుడు : (వెనుకటిలాగే అనుమానంతో) నన్నెరిగిన వారెవరూ ఉన్నారనటానికి వీల్లేదు.

పే. పె : (ఏదో జ్ఞాపకం వచ్చినదానిలాగా) ఆ ! అన్నట్టూ, మూడుమాసాల క్రితం ఈ నగరానికి చెందిన కల్యాణ సిద్ధిగారు కుమార్తెలతోసహా మీ సింహపురం వెళ్ళి అక్కడ నెలరోజులుండి వచ్చారే. అక్కడగాని నీకు వారి పరిచయం లభించలేదా, నాయనా?

జయచంద్రుడు : (స్వగతం) నీ కడుపుడకా! ఆవలిస్తే పేగులు లెక్కించేటట్టున్నదే ఈముసలిది! (పైకి) అవునవ్వా! నువ్వు ?బితే నాకిప్పుడు లీలగా జ్ఞాపకంవస్తోంది. ఆయన రెండో మార్తె కుసుమకోమలాంగి అన్నట్టు జ్ఞాపకం. పెద్ద మార్తె అదొకమాదిరి —

పే. పె : ఆఁ, కొరకరానికొయ్య ! (స్వగతం) నీ జాతకచక్రం నే నప్పుడే వేశానురా, నాతండ్రీ ! (పైకి) నీకు కల్యాణసిద్ధి గారి పరిచయం కావాలంటే నా శాయశక్తులా ప్రయత్నించగలను, నాయనా !

జయచంద్రుడు : (ఉత్సాహంతో) నిజమా, అవ్వా ?

పే. పె: అబద్ధమాడతానా, నాయనా ? ఈ సిద్ధులుగారు నీవయసులో వుండగా ఆయన తండ్రి ఆమోదించని కన్నె మీద మక్కువగలవాడై మనోవ్యాధిగానివున్న సమయంలో నే నెంతసహాయం చేశాను! నేనై చెప్పుకోరాదు గాని, ఆయన నామేలు మరువగలరా ? నీవైనా పరాయివాడవా ? మార్తాండపాళిగారి మునిమనవడవేగా ?

జయచంద్రుడు: ఇంక దాచి లాభం లేదవ్వా. నా కడుపులో ఉన్న రహస్యం నీకు చెప్పేస్తాను. ఈ కల్యాణసిద్ధిగారి రెండవకుమార్తె జలజ నా కంటపడినక్షణంనుంచీ నాకు నిద్రాహారాలు లేవు. మన్మథుడూ, అతని మేనమామ చంద్రుడూ నాకు బద్ధ శత్రువులైపోయారు. నేనేంచేసేది? నాకేది దారి? రణరంగంలో ధీరుడు ఒక్కసారిగా చచ్చి పోతాడు. మన్మథుడు నాపై సాగించే ఈ మార యుద్ధంలో నేను ఒక్కొక్కలిప్తే మరణిస్తున్నాను.

పే. పె: (ఓదారుస్తూ) ఊరుకో, నాయనా! బాధపడకు. నిక్షేపంలాంటివాడవు. అన్నివిధాలా జలజకు తగ్గ కాని కల్యాణసిద్ధి పూర్వంమనిషి కాడు. భా తరవాత ఆయనకు కాలమూ, ఖర్మమూకూ రాలేదు. ఆస్తి చాలా భాగం పోయింది. పెద్ద గౌరి పరమగయ్యాళి. జలజ ఎంత మృదుహృదయంకల గౌరి అంతరాకాసి. ఈ రాకాసి నెవరు పెళ్ళాడతారు ?

జయచంద్రుడు : అదేమవ్వా ? గౌరిని పెళ్ళాడినవారికి పది వేల వరహాలు కట్నమిస్తానని సిద్ధిగా రంటున్నారటగా ?

గౌరి : తేభ్యంగాడివి—అందరూ నీలానే ఉంటారని నీ ఉద్దేశం. నన్ను గురించి ఎవరూ ఒక్క మంచిమాట అనరాదేం?

జయశంకరుడు : (తన్మయత్వం అభినయిస్తూ) సందేహం లేదు. ఈమె గౌరి. నా స్వప్నసుందరి! నా సుగుణమణి! నా చిలుకలకొలికి! నా కాబోయే ఇల్లాలు! ధన్యోస్మి! ధన్యోస్మి!

గౌరి : నిలబడే ఉన్నారు. కూచోండి!

జయశంకరుడు: నీకోరిక తెలిసినాక నెరవేర్చకుండా ఉంటానా?

శాలివాహనుడు : ఇంతకాలానికి గౌరి అడుగులకు మడుగులొత్తేవాడొకడు కనిపించాడు. ఈ వైభవం ఎన్నాళ్ళో చూడవలసిఉంది.

గౌరి : ఆటే పేలకు, శనిగాడా! నిన్ను ఉద్ధరించేవాడొచ్చాడని సంతోషించు. జలజ అడుగులు కడిగి ఆచమనం చెయ్యటానికి నువ్వు సిద్ధంగా లేవూ? సిగ్గులే?

జయశంకరుడు : ఈ–ఈ–గడ్డిపోచ! నిన్నవమానం చేస్తుంటే, చెప్పు గౌరీ, నా పదునైన కత్తితో వీడి తల ఒక్కవేటున ఎగరేస్తాను.

గౌరి : శభాష్! ఇప్పుడే వద్దు. అయినా ఈ అల్పాయువుకు మీరుకూడా దేనికి? నేను చాలనూ?

జయశంకరుడు : నాకు కాబోయే కన్యకు అలాటి ధైర్యసాహసాలుంటే నాకింక కావలసిందేమిటి? ... ఈ తోటకూరకాడ ఎవరు? కొంపతీసి, జలజ అని అంటున్నారే, ఆమేనా ఏమిటి? ఆమెవెంట సోలుతూ వచ్చే నిట్టూర్పుల రాయడు?

కల్యాణసిద్ధి : ఈమె నా రెండవ కుమార్తె జలజ. ఇతను నాకు వేలువిడిచిన మేనల్లుడు విక్రముడు. ఈ కుర్రవాడుకూడా నాబంధుకోటిలోవాడే — శాలివాహనుడు. వీళ్ళిద్దరికీ జలజను చేసుకోవాలనేకోరిక ఉంది. గౌరివివాహం కాగానే జలజ వివాహంకూడా చేసేస్తాను.

జయశంకరుడు : అలా అయితే మనం ఏకాంతంగా ఒక విషయం మాట్లాడుకుందామా ?

కల్యాణసిద్ధి: మనం అవతలి గదిలోకి పోదాం. అమ్మాయిలూ, అబ్బాయిలూ ఈలోగా మీ మీ అనుమానాలు తీర్చేసుకోండి. ఇవాళే మన చిక్కులన్నీ విడిపోవాలి. ( జయశంకరుడితో నిష్క్రమిస్తాడు. )

జలజ : ( చాలా నాజూకుగా, మాట్లాడితేనే కందిపోయే దానిలా మాట్లాడుతుంది. ) నన్నెందుకు రమన్నావుట, చిన్నబావా ?

శాలివాహనుడు : ఇంత కాలానికి మీ నాన్న కోరిక ఫలించింది. గౌరికి సంబంధంవచ్చింది.

జలజ : నిజమా, అక్కా ? నాకెంత ఆనందంగా ఉంది ?

గౌరి : నీ ఆనందం ఎవడికావాలి ? నీ ఏడుపెవడికావాలి? నాకోసం ఎవరూ రారనిగదా మీ నమ్మకం. ఎవరో వచ్చారు గనుక ఏడవండి. ఆనందమని ఇచ్చకాలాడటం దేనికి ?

శాలివాహనుడు : నువ్వు కాస్సేపు నోరు కట్టెయ్యి, మహాతల్లీ, మేం తేల్చుకోవలసిన ముఖ్యవిషయానికి అడ్డు రాకా ?...చూడు, జలజా! నేనూ, విక్రముడూ నిన్ను

పెళ్ళాడగోరుతున్నాం. మాలో ఎవర్ని పెళ్ళాడగోరు తావో చెప్పెయ్యి; గౌరిపెళ్ళి కివ్వవలసిన కట్నం వాళ్ళే ఇచ్చుకుంటారు.

జలజ : అంటే ? నాకర్థంకాలేదు.

శాలివాహనుడు : నువ్వు నన్ను పెళ్ళాడతానంటే వదివేల వరహాలూ నే నిచ్చుకుంటాను. విక్రముణ్ణి పెళ్ళాడతానంటే విక్రముడిచ్చుకుంటాడు. ఇచ్చుకోలేకపోతే మీరూ మీరూ ఏ గంగలోనన్నా కలవండి; నాకుమటుకు సంబంధం లేదు.

జలజ : అక్కపెళ్ళినిగురించి ఎంత హీనంగా మాట్లాడుతున్నావు బావా ? అక్కకేం తక్కువని భర్తను కొనుక్కుంటుందీ ?

విక్రముడు : లేకపోతే ఈ ఇనపగజ్జెల తల్లిని ఊరికే ఎవడన్నా పెళ్ళాడతాడా ఏం ?

గౌరి : ఇనపగజ్జెలన్నావంటే బుర్ర ఎగిరిపోతుంది జాగర్త! అవతలిగదిలో నాన్నతో మాట్లాడుతున్నవాడు మనిషి కాడూ ?

శాలివాహనుడు : (ఆశ్చర్యంతో) ఇప్పుడేగా అతన్ని గంగిరెద్దన్నావూ ?

గౌరి : గంగిరెద్దుకేం లోటొచ్చిందీ ? మీకన్న మగధీరుడు, మీకన్న అందంగా ఉన్నాడుకూడా ? మీఇద్దరిదీ నిజంగా మగపుటకేనా ?

విక్రముడు : పెళ్ళికాబోతున్నా ఆనోటికి హద్దూ పద్దూ లేదు. ఛీ, ఛీ! ఏంజన్మ, ఏం, జలజా ! ఏదో ఒకటి తేల్చిచెప్పు.

జలజ : (నీరసంగా) ఏం చెప్పమంటావు పెద్దబావా? అక్క కోసం మొగుణ్ని కొంటారంటే నాకు తలతీసేసినట్టుంది. అభిమానంగలది, ఆమె మాత్రం ఈ పెళ్ళికి ఎట్లా ఒప్పుకుంటుంది.

శాలివాహనుడు : మొగుడు దొరికితేనే చాలురా భగవంతుడా అనుకునేది ఒప్పుకోకేంచేస్తుంద.

గౌరి : ఆకూతే కుయ్యోద్దన్నాను! నన్ను పెళ్ళాడేవాడు గవ్వ కూడా తీసుకోకుండానే పెళ్లాడతాడు.

విక్రముడు : (వెటకారంగా) అంతేనా? ఎదురు డబ్బుకూడా ఇస్తాడు! అదే అవతలి గదిలో జరుగుతున్న రాయబారం. పాపం, కనిపెట్టుకుక్కాచో!

గౌరి : నేను నమ్మను.

విక్రముడు : అరుగో, వాళ్ళే వస్తున్నారు. అడిగి కనుక్కోరాదూ?

గౌరి : ఏం, నాన్నా? నాకీమనిషిని మొగుడుగా కొంటున్నారా?

కల్యాణసిద్ధి : అవేం మాటలమ్మా? కట్నంకింద పదివేల వరహాలిస్తామనుకున్నాం గద. అన్నప్రకారం ఇచ్చేస్తాం. అంతా స్థిరమైపోయింది.

గౌరి: ఏమీ స్థిరంకాలేదు. నే నీ పెళ్ళికి ఒప్పుకోను. మీరంతా కలిసి ఎందులోనన్నా పడండి. (వెళ్ళిపోతుంది)

శాలివాహనుడు : ఆ పదివేల వరహాలైనా జలజ నన్ను పెళ్లాడితేనే నేనిస్తాను. లేకపోతే ఇవ్వను.

విక్రముడు : జలజ నన్ను పెళ్ళాడతానన్నా నేనొకర్ణి పది వేల వరహాలివ్వలేను.

జయశంకరుడు : నేను గౌరితో ఏకీభవిస్తున్నాను. నాకాబోయే భార్యకు పదివేలు ఒక భరణంకాదు. ఇరవైవేలైనా లేనిదే నే నీ పెళ్ళికి ఒప్పను. (రెండు క్షణాలపాటు నిశ్శబ్దం)

కల్యాణసిద్ధి : (కుంగిపోతూ) పరాత్పరా ! నన్నెందు కిలా విషమపరీక్షకు గురిచేస్తున్నావు ? నేనేం మహాపాతకం చేసి ఇలా అనుభవిస్తున్నాను ?

జలజ : (చిన్నగొంతుతో-అమాయికంగా) పెద్దబావా, చిన్న బావా ! ఈ పరిస్థితిలో అక్కవివాహం అవుతుందని నాకు తోచదు. మీలో ఎవరినన్నా మనసులో ప్రతిష్ఠించు కున్నానంటే నాకు యావజ్జీవ విరహంతప్ప మరొకటి ఉండ బోదు కనుక నన్ను క్షమించండి. నేను నా జీవితశేషాన్ని పుస్తకాలతోనూ సంగీతంతోనూ వెళ్ళబుచ్చుకుంటూ సన్యాసినివలె జీవిస్తాను, శలవు ! (పోతుంది)

పే. పె : (జయచంద్రుడితో వస్తూ) విజయీభవ ! దిగ్వి జయీభవ !

కల్యాణసిద్ధి: రా, పెద్దమ్మా, రా! ఒక్కక్షణం ముందు వచ్చి ఉంటే భగవత్సృష్టి వైచిత్రి కళ్ళారా చూసి ఉండే దానివి;...ఈ కుర్రవాడెవరూ ?

పే. పె: ఈ అబ్బాయి మా దూరపు బంధువు. పేరు శివవర్మ.

జయశంకరుడు : నువ్వేట్రా, శివవర్మా ? చప్పున పోల్చలేక పోయాను సుమా! ఎప్పుడొచ్చావు? ఏమిటి విశేషాలు ?

కొత్తగా కావ్యాలేమైనా రాశావా? కొత్త సంగీత విద్వాంసులనేమైనా తయారుచేశావా ?

జయచంద్రుడు : అన్నగారు నాశక్తిని అతిశయించి ప్రకటిస్తున్నారు.

జయశంకరుడు : చాలించవోయ్, నీ వినయం ! శివవర్మఖ్యాతి ఇక్కడిదాకా పాకలేదనా నీ ఉద్దేశం ?

విక్రముడు : అయ్యో, తమది ప్రసిద్ధమైన పేరుగదండీ !

శాలివాహనుడు : శివకవి అంటారు వీరినేనా ?

జయశంకరుడు : ఛీ, ఛీ! శివకవిగాడు మావాడి కాలిగోరుకు పోలడు. మావాడు శివవర్మ...ఒరే, శివుడూ ? మా అదృష్టంకొద్దీ ఇంత దూరం రానేవచ్చావు. మన కల్యాణసిద్ధి మామగారి రెండో అమ్మాయి సాహిత్య సంగీతాలలో అభిరుచిగలది. నువ్వు ఇక్కడ ఉండే నెలో, రెండు నెలలో ఈ ఇంటనే ఉండి ఆ పిల్లకు ఉన్నతవిద్య చెప్పరాదూ ?

జయచంద్రుడు : ఆస్థ ఉన్నవారికి నేర్పటానికి కాకపోతే నా విద్య దేనికీ ?

కల్యాణసిద్ధి : మా జలజ చాలా విరక్తిగావుంది. ఆమె విరక్తి పోగొట్టటానికైనా తమరు మా ఆతిథ్యం స్వీకరించి అనుగ్రహించాలి.

జయచంద్రుడు : పెద్దలు తమరింతగా అడగాలా ?

కల్యాణసిద్ధి : పెద్దమ్మా, వీరిని చిన్నమ్మాయివద్దకు తీసుకుపో !

జయశంకరుడు : మనం ఒక్కక్షణం ఏకాంతంగా మాట్లాడుకుందామా ?

కల్యాణసిద్ధి : అలాగే. పద !
విక్రముడు : శివవర్మగారూ, ఒక్కమాట వినిపొండి. (దగ్గరకు వచ్చినదాకా ఆగి జయచంద్రుడి చెవిలో రహస్యంగా) ఎలాగైనా జలజ మనసు నామీదికి తిప్పగలిగితే అయిదు వేల వరహాలు తాంబూలంలో పెట్టి ఇచ్చుకుంటాను. ఏం ?
జయచంద్రుడు : అదెంత భాగ్యం ! మన చేతిలోపని.
శాలివాహనుడు : అయ్యా, శివకవిగారూ !
జయచంద్రుడు : తమరు పరాకు చిత్తగిస్తున్నారు ?
శాలివాహనుడు : సెంపలేసుకున్నాను. శివవర్మగారూ; ఒకే ఒక్కమాట! (చెవిలో రహస్యంగా) తమరెలాగైనా జలజ మనసు నా వేపు తిప్పగలిగారో పది వేల వరహాలు తమకు ధారపోసుకుంటాను. ఏం ?
జయచంద్రుడు : శాయశక్తులా యత్నిస్తాను.
పేదరాసి పెద్దమ్మ : (దూరంనుంచి) వస్తున్నావా నాయనా!
జయచంద్రుడు : (గట్టిగా) వస్తున్నానవ్వా!

## మూడవ రం

[కల్యాణసిద్ధిగారింట

జలజ : ఏం, గురూ ! విచారంగా ఉ

జయచంద్రుడు : ఏం చెప్పను. జ ... గ తలపెట్టాను. అందులోని ... రాలు లేకుండా చేస్తున్నా ... కుంటునే నేను కుంగిపోతున్నాను

జలజ : (ఆత్రంగా) ఏమిటండీ ఆ కావ్యకథ ? సంగ్రహంగా చెప్పరూ ?

జయచంద్రుడు : కథకేమున్నది ? శిష్యురాలిని ప్రేమించి విరహబాధపడిన బిల్హణుడులాంటి గురువు కథ.

జలజ : ఓహో! యామినీపూర్ణతిలక కథా !

జయచంద్రుడు : ఆ కథ నీకు తెలుసునా, జలజా ?

జలజ : తెలుసును. ఆ యామినీపూర్ణతిలక మనసు ఊహించి ఎన్నోసార్లు నేనే సంతాపం చెందాను.

జయచంద్రుడు : అలాగా ? అయితే నాకామె హృదయం విప్పిచెప్పగలవా ? నా కావ్యానికి ఎంతో ఉపకరిస్తుంది.

జలజ : కాని ఇప్పుడు నేనున్నస్థితిలో నా బాధలే భరించలేకుండా ఉన్నాను. ఇంకొకరి బాధ ఎక్కడ స్మరించను ?

జయచంద్రుడు : చెప్పావుకావేం ? నీకుగల మనోవేదన నాకుగాక మరెవరికి చెబుతావు? నీ సమస్య లేవైనా ఉంటే నేను పరిష్కరించగలుగుతానేమో ?

జలజ : నా సమస్యలు ఆ భగవంతుడే పరిష్కరించాలి. (నిట్టూరుస్తుంది.)

జయచంద్రుడు : అదేం, జలజా ! భగవంతుడికిచ్చిన అవకాశంలో సహస్రాంశం నాకుకూడా ఇవ్వరాదూ ? నే నే [illegible] ాడినా ?

జలజ : అం [illegible] వంటి కన్య దేనిని గురించి కలలు కంటుంది?

జయచంద్రుడు [illegible] ా ప్రేమను గురించి!

జలజ : అయిన పక్షంలో నేను కలలు కనటానికెవరున్నారు? మా పెద్దబావా? సరసుడే! కాని ఎంతసేపూ తన హృదయం తెచ్చి నా పాదాలదగ్గర నైవేద్యం పెడతాడు తప్ప నా హృదయాన్ని కదిలించడు! తనపై నాకు మంచి అభిప్రాయం కలిగేటందుకుగాను ఇతరులపై నాకు అసహ్యం పుట్టిస్తాడు. మా చిన్నబావపై అసహ్యం పుట్ట టానికి నాకు విక్రముడి సహాయం కావాలా? మీరే చెప్పండి.

జయచంద్రుడు : అవసరంలేదు. ఆమాటకొస్తే మీ పెద్దబావ మీద అసహ్యం కలగటానికి చిన్నబావ సహాయమూ అవసరం లేదు.

జలజ : బాగా చెప్పారు... ఆ ఇద్దరిలో ఎవరినో ఒకరిని నేను వెంటనే ఎన్నుకోవాలట. నేనేంచేసేది?...మీకు పుణ్యం ఉంటుంది; నాకొక్క సహాయం చేసిపెడుదురూ?

జయచంద్రుడు : నీ కోసం ఏమి చెయ్యను, జలజా?

జలజ : నేను ప్రేమించి పెళ్ళాడదగిన వ్యక్తి నాకు లభించే దాకా, మా అక్క వివాహం కాకుండా చూడండి.

జయచంద్రుడు : నీవు ప్రేమించి పెళ్ళాడదగిన వ్యక్తి నీకు సమీపంలోనే ఉన్నాడని నా అంతరాత్మ చెబుతున్నది.

జలజ : నాకు సమీపంలో ఉన్న వ్యక్తిని నేనెందుకు తెలుసుకో లేకుండా ఉన్నానూ?

జయచంద్రుడు : ముగ్ధురాలా, నీకు ప్రేమనుగురించి ఏమి తెలుసు?

జలజ : అదీ నిజమే. ప్రేమ ఎలా ఉంటుందో చెప్పగలరా ?

జయచంద్రుడు : అది అనిర్వచనీయమైనది. అనుభవైకవేద్య మయినది. నేను రాయబోయే కావ్యంగురించి వింటావా ?

జలజ : వింటే నాకు ప్రేమనుగురించి తెలుస్తుందా ?

జయచంద్రుడు : ఎంత చెడ్డ కవిని, నేను నీకు ప్రేమను గురించి చెప్పలేకపోతే మహాకరితరమవుతుందా ?

జలజ : అయితే చెప్పండి.

జయచంద్రుడు : నా కథానాయకుడు జయచంద్రుడనే యువ కుడు, బుద్ధిమంతుడు, ధనవంతుడు; ఒకనాడతడు అశ్వా రూఢుడై పురవీధిని వెళ్లుతూండగా ఒక మేనా ఎదురయింది. ఆ మేనాలోనుంచి తొంగి బయిటికి చూసే ఒక లావణ్య వతి ముఖం అతనికి కనిపించింది. పూర్ణచంద్రుణ్ణీ, కలు వలనూ కూడా జయించిన ఆ ముఖం కనబడినక్షణంనుంచీ అతడు మారిపోయాడు. అతని కళ్లు మరి దేన్నీ చూడలేక పోయాయి. అతని చెవులు సంగీతాన్నికూడా భరించలేక పోయాయి. నిద్రాహారాలు అతన్ని బహిష్కరించాయి. అతడు పిచ్చివాడిలా అయిపోయాడు. తాను చూసిన పద్మినికొరకు బయలుదేరాడు. దేశదేశాలు దాటి ఆమె ఉన్న దేశం చేరుకున్నాడు.

జలజ : ఎంత పట్టుదలా !

జయచంద్రుడు : అంతటితో అయిపోయిందా ? ఆమె కావ టానికి సరస్సులోని జలజమే. అయితేనేం? ఆమె చుట్టూ ఎన్ని మొసళ్ళు ! ఎంత బురద ! ఎంత తామరతంపర !

జలజ : అలాటప్పుడా జయచంద్రుడు భ్రమర రూపం దాల్చి అన్ని అవాంతరాలనూ దాటి నేరుగా వచ్చి ఆమెవద్ద వాలితే ఎంత బాగుంటుంది !

జయచంద్రుడు : జలజా! జయచంద్రుడి హృదయం ఎంత బాగా కనిపెట్టావు ! దానికే అతను యత్నించాడు. మారు రూపం ధరించి తన ప్రాణసమానురాలైన జలజం సమీపం చేరుకున్నాడు. కాని అంతటితో అయిందా ?

జలజ : ఇంకా అవాంతరాలున్నాయా ?

జయచంద్రుడు : లేవా మరి ? జయచంద్రుడి ప్రేమను జలజ స్వీకరిస్తుందా, తృణీకరిస్తుందా ?

జలజ : (ఆశ్చర్యంతో) జలజా ? నేనా ?

జయచంద్రుడు : అవును, జలజం! నీవే. నీకోసం జయచంద్రుడిన్నిపాట్లు పడతాడంటే ఊహించలేవా? నీ కోసం వాడు ఇన్నిరోజులుగా తపిస్తున్నాడంటే నమ్మలేవా ?

జలజ : ఆ జయచంద్రు డెక్కడ ?

జయచంద్రుడు : ఇంకెక్కడోనా ? ఇక్కడే !...నేనే జయచంద్రుణ్ణి.

జలజ : మీరా ? మీరు శివవర్మగారు కాదా ?

జయచంద్రుడు : అది నా భ్రమరరూపం, జలజం !

జలజ : ఈ సంగతి నే నిప్పుడు మా నాన్నగారికీ, బావలకూ చెప్పేస్తే ?

జయచంద్రుడు : చెప్పెయ్యి. జలజం! నాకేమీ నష్టం కల గదు. నన్ను మన్మథుడెలాగు దహిస్తూనేవున్నాడు. నువ్వు నా ప్రేమను స్వీకరించనిపక్షంలో నాకెలాగూ చావు రాసి

పెట్టేవుంది. కాని నువే ఒక ప్రియుణ్ణి పోగొట్టుకుంటావు! నాకన్న నిన్ను అధికంగా మరొకడు ప్రేమించగలడా? నీకోసం నాలాగా మారువేషంలో ప్రవేశించి నీచెంత చేరగలడా? అసంభవం! ఆలోచించుకో! తరువాత నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి.

జలజ : ఆలోచించటానికి కొంచెం వ్యవధి ఇవ్వండి.

## నాలుగవరంగం

[కల్యాణసిద్ధి ఇల్లు—కొద్దిరోజుల అనంతరం]

విక్రముడు : (దూరంనుంచి అరుచుకుంటూ) మామా, మామా!

కల్యాణసిద్ధి : ఏం? ఏమిటది?

విక్రముడు : జలజ ఎక్కడా కనిపించదే.

శాలివాహనుడు : ఎక్కడికి పోతుందీ? ఎక్కడో ఉంటుంది.

విక్రముడు : ఇంకెక్కడుంటుంది? అంతటా వెతికాం. గౌరి కూడా వెతికింది.

శాలివాహనుడు : ఆ శివకవిగా డేమైనట్టు?

విక్రముడు : వాడూ కనిపించటంలేదు.

శాలివాహనుడు : ఇంకేం? వాడు దొరికితే అదీ దొరుకుతుంది. దొంగముండా కొడుకు, జలజ మనస్సు నాకేసి తిప్పుతానన్నాడు.

విక్రముడు : నాతోనూ ఆమాటే అన్నాడు. వీడి కడుపుడకా! ఎంతపనిచేశాడూ! బెల్లంకొట్టిన రాయిలాగా మాట్లాడవేం, మామా?

కల్యాణసిద్ధి : (విచారంతో) నేనేం మాట్లాడను ? నన్నేందుకు వేధిస్తారు ? నా రోజులు మంచివికావు. గౌరిగీత అంతకన్నా మంచిదికాదు. మీరేనో లేనిపోని ఆశలు పెట్టుకున్నారు. అందరి ఆశలూ నీటగలిపింది జలజ. అది ఇంత పని చేస్తుందని కలలోకూడా ఊహించలేదు. ఆ జయశంకరుణ్ని రానివ్వండి, రాజభటులకు వప్పగించి కొరతవేయిస్తాను. వాడే నా కొంపకి చిచ్చుపెట్టాడు.

గౌరి : (వస్తూ) నీ ముద్దుల కూతురు లేచిపోయింది, నాన్నా!

కల్యాణసిద్ధి : ఆ మాట నువ్వు చెప్పకుండానే తెలిసింది.

గౌరి : ఈ ఉత్తరం పెట్టిపోయింది. చదవనా ?

విక్రముడు : పోనీ నే చదువుతాను.

గౌరి : దాని ఉత్తరం ముట్టుకునైనా పవిత్రమౌదామనా? నాకూవచ్చు ఈపాటి చదువు. (చదువుతూ) "శ్రీ శ్రీ మహావిష్ణుస్వరూపులైన నాన్నగారికి, మీ కుమార్తె జలజ నమస్కరించి వ్రాయునది. నన్ను వైరాగ్యకూపంనుంచి ఉద్ధరించిన జయచంద్రుడుగారిని గాంధర్వవిధిని పెళ్ళాడ నిశ్చయించాను—

శాలివాహనుడు : జయచంద్రు డెవరు ?

గౌరి : గుర్రం కట్టెయ్యి. (చదువుతూ) "ఆయన నాకోసరం చాలా దూరంవచ్చి శివవర్మ అనే పేరు పెట్టుకుని మన ఇంట ప్రవేశించారు. ఆయన దీక్షకు ముగ్ధురాలనై ఆయన ప్రేమను స్వీకరించాను. మీ అనుమతితో పెళ్ళాడదామంటే గౌరి పెళ్ళిముందు జరగాలని మంకుపట్టుపట్టి

కూచున్నారు, కనక ఈ పని చేయవలసివచ్చింది. నన్ను మన్నించాలి.

విక్రముడు : అంటే జయశంకరుడు ఇందులో చేరిఉన్నాడన్న మాట...అదుగో మాటలోనే వస్తున్నాడు, ( గొంతు తగ్గించి ) మామా, ఏరి నీ రాజభటులు ?

జయశంకరుడు : ఏం, మామగారూ, ఏదో ఆలోచనలో మునిగి ఉన్నారు. నా చిలుకల కొలికి గౌరి ఏమంటుంది?

గౌరి : నే నెవరి కొలికినీకాను ? నా చెల్లెల్ని మీ తోడు దొంగ లేవదీసుకుపోయాడు. దానికేం చెబుతావు ?

జయశంకరుడు : (ఆశ్చర్యం నటిస్తూ) శివశర్మ !

గౌరి : ఇంకా ఎందుకీ నటన ? అతనిపేరు జయచంద్రుడని మా కందరికీ తెలుసును.

జయశంకరుడు : జయచంద్రుడా ? వాడెవడు ? నే నెరగనే ?

గౌరి : ఎరక్కపోతే ఎట్లా గుర్తుపట్టావు ?

జయశంకరుడు : ఆరి దొంగగాడిదా ! మారుపేరు పెట్టుకొచ్చి నన్నే మోసం చేస్తాడుగా ! వాణ్ని నా కత్తితో కండలు కోసి కాకులకువేస్తాను. ఏడీ వాడు?

కల్యాణసిద్ధి : వాడూ నా కుమార్తె జలజా నిన్నరాత్రే లేచి వెళ్ళిపోయారు. గాంధర్వవివాహం చేసుకున్నారు. చేసుకుంటే చేసుకున్నారు. నాకు గౌరి ఒక్కతే కూతురనుకుంటాను నా ఆస్తి యావత్తూ దానికే ఇస్తాను. పెళ్ళి గీతఉంటే అవుతుంది. లేకపోతే లేదు.

జయశంకరుడు : అదేమిటి, మామగారూ! గౌరిని చేసుకోవటానికి నే నుంటేనే ?

కల్యాణసిద్ధి : మనం అనుకున్నట్టు నీకు పదివేల వరహాలివ్వలేను నాయనా! అసమర్థుణ్ణి, అన్నమాట. చెల్లించలేనందుకు క్షమించు.

గౌరి : అసలు నే నీ భ్రాష్టుణ్ణి చేసుకోబోవటంలేదు. నువ్వెందుకు క్షమాపణ కోరతావు, నాన్నా? నాకోసం మొగుణ్ణి కొంటే ఒప్పుకుంటాననుకున్నావా?

జయశంకరుడు : ఏమన్నావు, గౌరి? నేనా అమ్ముడుపోయేవాణ్ని? దుర్మార్గురాలైన నీ చెల్లెలు నామీద నీ మనస్సు విరిచినట్టున్నది. ఫరవాలేదు. మీ నాన్న అసమర్థుడై, అన్నమాట నిలబెట్టుకోలేకపోతే మానె. నా మాట నిలబెట్టుకుంటాను. నీ వివాహాభారం మీ నాన్నపైనుంచి ఇప్పుడు నాపైపడింది నన్ను కాకపోతే ఈ తొండ మొహాలవాళ్ళిద్దరిలో ఎవరినో ఒకరిని ఏరుకో. పెళ్ళికి నీ చెల్లెలు పనికిరాగా లేందీ, నువు పనికిరావా ఏమిటి? ...దానికన్న పదిరెట్లు అందగత్తెవి, సాధుశీలవు?

విక్రముడు : ఏమిటి నీ ధాష్టీకం? మమ్మల్ని బలాత్కారంగా ఈ పిశాచికిచ్చి పెళ్ళిచేస్తావా ఏం!

జయశంకరుడు : (పళ్ళుకొరుకుతూ) నేను ప్రేమించినదాన్ని పిశాచి అంటావురా, అప్రాచ్యుడా! ఒకటే వేటుతో నీ శిరస్సు సహస్రవక్కలు చేస్తా! (భీకరమైన చప్పుళ్ళు చేస్తాడు.)

గౌరి : (కంగారుతో) ఊరుకోండి, ఊరుకోండి! విక్రముణ్ణి నేను నా బొందెలో ప్రాణంవుండగా పెళ్ళాడను.

జయశంకరుడు : మరి నీమాట ఏమిటి ? నువ్వే మిగిలావు !

శాలివాహనుడు : నన్ను క్షమించండి. గౌరి నన్ను వొదిలేసి మరెవణ్ణి పెళ్ళాడినా నా కానుకకింద పదివేలవరహాలిచ్చు కుంటాను.

విక్రముడు : అదేవిధంగా నేనో అయిదువేలవరహాలిచ్చు కుంటాను.

జయశంకరుడు : ఇక నేనేనా మిగిలాను ! గౌరీ, నా ఆరో ప్రాణం ! ఎట్లాగైనా నన్ను పెళ్ళాడటానికి నీ మనస్సును సమాధానపరుచుకో ! నేను నిజంగా నీకు తగను. నాకు ప్రచండమైన ఆగ్రహం పెట్టాడు దేవుడు ! ముందు కత్తి వేటువేసి తరవాత ఆలోచిస్తాను! నాతో కాపరం చెయ్యటం క్షణక్షణ గండం ! నీ వంటి సుకుమారి నన్ను భరించలేదు! నాకు తెలుసు ! కాని—

గౌరి : ఏడిచినట్టే ఉంది నీ ప్రయోజకత్వం! ఏమిటో నేనూ చూస్తా ! పురోహితుణ్ణి పిలిపించు, నాన్నా !

కల్యాణసిద్ధి : ఓ ! క్షణంలో ! ఇప్పుడే పోతున్నా ! "శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం..." (ఆంజనేయదండకం చదువుతూ నిష్క్రమిస్తాడు.)

జయశంకరుడు : విక్రమా, శాలివాహనా ! మీ శకం అయిపోయింది. వెనక్కు తగ్గండి.

—:o:—

[1]

# నడమంత్రపు సిరి

## (ట్యుటోరియల్ స్కూల్)

శాస్త్రి : శూర్పోష్యోయ్, దాసూ! పేపరు చూశావుగా? బెనారస్ మెట్రిక్ పిల్లలు నలుగురూ మనమాట దక్కించారు.

దాసు : అవును, చూశా.

శాస్త్రి : అందులో ఇద్దరైనా డింకీకొడతారనుకున్నా.

దాసు : వాళ్ళ అదృష్టం బాగుందిలే.

శాస్త్రి : నువ్వూ నేనూ వాళ్ళు చచ్చేట్టు సానపడితే అదృష్ట మేమిటి, అదృష్టం?

దాసు : అదృష్టంకూడా కలిసిరావాలిగా?

శాస్త్రి : వాళ్ళ అదృష్టమేం చూశావ్? మన అదృష్టం చూడు. యీ యేడు మన ట్యుటోరియల్ స్కూలు పిల్లల సంఖ్య రెట్టింపుకావాలి మరి. మనిద్దరివల్లా కాదు. ఇంకో మేష్టర్నికూడా వేసుకుందాం. ఏమంటావ్?

దాసు : అట్లాఅయితే ఒక మేష్టరుకాదు, ఇద్దరు కావలి సొస్తారు మరి.

శాస్త్రి : ఏం?

దాసు : నేను వెళుతున్నా శాస్త్రీ, పట్నం. ఆ మాట చెబుదామనే వచ్చా.

శాస్త్రి : (దిమ్మరపోయి) పట్నమా? ఏదన్నా ఉద్యోగమా?

దాసు : వచ్చిందో సినిమాఛాన్సు...చూస్తామనీ!

శాస్త్రి : చాలా సంతోషం. వేషం వేస్తావా ?

దాసు : కాదోయ్, డైరెక్టరుకు అసిస్టెంటు. నా స్నేహితుడొకడు...చాలాకాలం అసిస్టెంటు డైరెక్టరుగా ఉండి ఇప్పుడు డైరెక్టరు చాన్సు సంపాందించాడు. రమ్మని రాశాడు. పోకపోతే బాగుంటుందీ ?

శాస్త్రి : ఒకట్టందుకు నాకు చింతగా ఉంది. కిందటేడు నేను నీ కిచ్చిన జీతం చాలాకొద్ది...

దాసు : నువ్వు పెద్దజీతం తీసుకున్నావు గనకనా ?

శాస్త్రి : అది వేరే సంగతి. ఈ ట్యుటోరియల్‌స్కూలు నేను నాటిన మొక్క. అది యివాళ కాకపోతే రేపైనా పెరిగి పెద్దదై ఫలమిస్తుంది. దాన్ని ఇద్దరం పంచుకుంటాం గదా అనే నమ్మకంతో నిన్నుకూడా నాతోబాటు శ్రమ పడనిచ్చాను. నువ్వు పడ్డ శ్రమకు ఫలితమేం దక్కింది?

దాసు : నా కా విచారంలేదులే. ఒక ఏడాదిపాటు ఊరికే కూర్చోకుండా కొంత సంపాదించుకునేందుకు అవకాశం ఇచ్చావు. నేను వెళ్ళిపోవటంవల్ల నీ కిబ్బంది కలక్కుండా ఉంటే చాలు నాకు.

శాస్త్రి : నీ అంత శ్రద్ధగా పనిచేసేవాళ్ళు దొరికితే ఇంక లేని దేం? అయినా ఏదోవిధంగా నెట్టేస్తానులే. ఇంతకీ ఎప్పుడు ప్రయాణం ?

దాసు : రాత్రి మెయిలుకు పోదామనుకుంటున్నా.

శాస్త్రి : మంచిది, దాసూ, విష్ యూ లక్.

దాసు : థాంక్స్; నాకింకా చాలా పనులున్నై. పోయిరానా మరి ?

శా : మంచిదోయ్.

దా : అన్నట్టు, మా బాబాయి కొడుకు చలపతిగాడు, లెక్కల్లో పూజ్యుడులే. వాణ్ణి బెనారస్ మెట్రిక్ చదివి స్తామా అని ఆలోచిస్తున్నారు. బహుశ నీ దగ్గిరికే తెస్తారు. కాస్త వాణ్ని కనిపెట్టుండు.

శా : అట్లాగే.

దా : వస్తానోయ్ మరీ.

శా : ఉండు, నేనుకూడా బయటికి వస్తున్నా...

దా : రా, అయితే...

( సోమసుందరంగారి యిల్లు )

సీత : (పేపరు చప్పుడుచేస్తూ, ఉద్రేకంగా) ఇదిగో నాన్నా! నా నెంబరూ. పాసయాను.

సోమ : అక్కడికి నా పూచీ అయిపోయింది. ఇక ఏం చేస్తావ్ ?

సీ : ఏం చెయ్యమంటే అది చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాను.

సో : (విరక్తిగా) ఏమిటో, ఏం చదువులో, 'ఆడ పిల్లలకి పెద్దచదువెందు'కని అందరూ అడుగుతూనే వచ్చారు. బియ్యే పాసయినా, ఎమ్మే పాసయినా, ఆడదానికి మొగుణ్ని సంపాదించుకోవటమే అసలైనఉద్యోగమన్నారు. అయినా పంతంకొద్దీ బియ్యేదాకా చెప్పించా. ఇక నీకు నేను చెయ్యగలది ఏమీలేదు. ఫలాని పని చెయ్యమని నీకు సలహాకూడా ఇవ్వలేను. పెళ్ళిచేసుకుంటావో, ఉద్యో

గమే చేసుకుంటాహో, ఎవర్ని పెళ్లిచేసుకుంటాహో ఏం ఉద్యోగం చేసుకుంటాహో — అదంతా నీ యిష్టం...ఎవరది? నువ్వటోయ్, శాస్త్రీ!...

సీ : (ఉత్సాహంతో) నేను పాసయ్యాను, శాస్త్రిగారూ.

శా : పత్రికలో చూశా.

సో : నువ్వు అహోరాత్రాలు ఇంగ్లీషు నూరిపొయ్యబట్టే పాసయింది.

శా : లేకపోయినా సీత తెలివిగలదేలెండి. ఏదైనా ఆధారం దొరికితే, నిలబడగలవాళ్ళకూడా అట్లా అనుకోబుద్ధవుతుంది. ఇంగ్లీషులో సహాయపడటానికి నేను దొరికాను గనక నా సహాయంతీసుకుంది. లేకపోతే తనకు తానే చదువుకునేది.

సో : ఇక ఏ ఆధారాన్నీ అనుకోవద్దనే అమ్మాయికి చెబుతున్నా. ఏమోయ్, నాకు చేతయిందంతా చేశా. బియ్యే పాసయింది. ఇక పెళ్ళే చేసుకుంటుందో, ఉద్యోగమే చేసుకుంటుందో తన ఇష్టం! ఏమంటావ్, శాస్త్రీ.

శా : మీరు గనక సీతకి ఇంతచదువు చెప్పించారుగాని, మీ స్థితిలో కొందరు మగపిల్లలకూడా కాలేజీ చదువు చెప్పించరు.

సో : కాదుమరీ?......అయినా ఇందులో నా స్వార్థంకూడా లేకపోలేదులే. అమ్మాయి ఘోర్తుఘోరం చదువుతుండగానే ఆలోచనచేశా—దీనికి చదువు చెప్పించటం సులభమా, మొగుణ్ణి సంపాదించటం సులభమా అని. ఎంత ఆలోచించినా చదువే తేలికనిపించింది.

శా : మంచిఆలోచనే చేశారు. కాని, చదువుకున్న ఆడవాళ్లు తమ పెళ్ళిళ్ళు తామే చేసుకోగలరని మీా నమ్మకమా ?

సో : ఏం ? ఎందుకు చేసుకోరాదూ ? ఇప్పుడు మా సీతమ్మే ఉందనుకో. దానికన్న నా ఎక్కువేముందీ ? అది సంపాదించుకోలేని మొగుణ్ణి నేమాత్రం ఎక్కడ సంపాదిస్తానూ? ఏమంటావ్ ?

శా : అనుకున్నంత సులభంకాదు, సోమసుందరంగారూ... పెళ్ళి అనేసరికి యెంతోమంది సహకారంకావాలి. శకుంతల దుష్యంతుణ్ణి చేసుకోవటానికి అనసూయా ప్రియంవదల సహాయం ఎంతవుందో చూడండి......

సో : అటువంటి సహాయం ఎవరన్నా చెయ్యొచ్చు. అసలు ఉద్యోగం ఓటి సంపాదించి నలుగురి మధ్యా తిరుగుతుంటే అన్నిసహాయాలూ వాటంతటవే వస్తాయి. అమ్మాయికెక్కడన్నా ఉద్యోగం చూసిపెడుదూ !!

శా : ఇక పత్రికలు ముందేసుకుని దరఖాస్తులు పెట్టటమే... అన్నట్టు ఒక ఉద్యోగం నేనే ఇవ్వగలను (అనుమానంగా) ...సీతకు అభ్యంతరం లేకపోతే !

సీ : అభ్యంతరం దేనికీ ?

సో : ఏమిటి, నాయనా, అదీ ?

శా : మరేంలేదు. మా ట్యూటోరియల్ స్కూల్లో ఇవాళే ఖాళీవచ్చింది. దాసు సినిమా చాన్సు సంపాదించి పట్నం వెళ్ళుతున్నాడు.

సీ : సినిమాచాన్సే! నీకు జ్ఞాపకంవుందా, నాన్నా? నా చిన్న తనంలో ఒక డైరెక్టరు మనవ్వూరొచ్చి నన్ను మాటలు చెప్పమన్నారు. పాడమన్నారూ!

సో : అపునవ్వును...నువ్వు పనికిరావన్నాడు.

సీ : చిత్రమండీ, శాస్త్రిగారు. 'నేనిప్పుడే వస్తాను' అన్నమాటని ఎన్నిరకాలుగా అనగలనో చూస్తానన్నాడు. నాకు చాత కాలా...ఆయన అనిచూపించి నన్ను అనమన్నాడు. అప్పటికీ చాతకాలా.

శా : నీకు చాతయినపని...మా పిల్లలకు పాఠాలు చెప్పు. ఎక్కువ ఇచ్చుకోలేరు. నెలకి యాభై యిస్తాను.

సో : నీకు సహాయం చెయ్యాలంటే జీతం తీసుకోవాలిటోయ్? ఊరికేనే ఉందిగా? పోనీ అట్లాగే చెబుతుందిలే.

సీ : ఆయన వేళాకోళానికంటుంటే నువ్వు నిజంపట్టించు కున్నావా, నాన్నా?

శా : వేళాకోళంకాదు, సీతా. నిజంగానే. ఈయేడు పిల్లలు ఎక్కువయ్యేలాగుంది. ఒంటరిగాణ్ణయిపోయాను. కొన్ని సబ్జెక్ట్సు మరెవరన్నా చెప్పేందుకుండాలి.

సీ : నేనేం చెప్పగలనండీ...నా మొహం!

శా : నేనుచెపితే నువ్వెందుకు చెప్పలేవ్? నా అంత చదువు నువ్వూ చదివావుగా?

సీ : అలవాటుండొద్దూ?

శా : రెండేళ్ళక్రితం నాకుమాత్రం ఏమలవాటుందీ? చెబు తుంటే అదేవస్తుంది. నీకేదన్నా అనుమానంవస్తే నేనుం టాను. జీతంవిషయమే ఆలోచించాలి. చాలా తక్కువ.

ఇంకా రెండుమూడేళ్ళు పోతేగాని స్కూలుకు పునాది యేర్పడదు. అప్పుడు ఇంకా స్త బాగా గిట్టుబాటవుతుంది. ఏమంటావు ?

సీ : ఏం నాన్నా ?

సో : నేనేమంటానే? నువ్వు యాభై రూపాయలు ఖర్చుచెయ్యటానికిబదులు, యాభైరూపాయలు తెస్తే అది కుటుంబానికి నూరురూపాయల ఆదాయమన్నమాట.

సీ : మీకు ధైర్యముంటే నన్ను వేసుకోండి.

శా : ఇంకో షరతుకూడా వుంది మరి.

సీ : ఏమిటది ?

శా : ఏప్రిల్ ఆఖరుదాకా అంటిపెట్టుకుండాలి. మధ్యలో మానేస్తే పాఠాలు పాడవుతాయి.

: ఎవరో పరాయివాళ్ళకు చెప్పినట్టు చెబుతున్నారే ! మధ్యలో మానేస్తానాండీ ?

శా : పరాయివాళ్ళు కాకపోయినాకూడా ఆదినిష్టూరం మంచిది సీతా !

సీ : మీ యిష్టంవచ్చినట్టే కానివ్వండి.

శా : నాకు పెద్ద బరువు వొదిలింది. ఒకవేళ ఇంకో మేష్టరు అవసరంకావచ్చు. ఏ ఇంటర్ పాసయినవాణ్ణయినా చూసి తేస్తానులే. మళ్ళీ కరపత్రాలు అచ్చువెయ్యాలి. నీ పేరుకూడా నాపేరుతోబాటు వేయిస్తాను.

సో : అవునోయ్. నువ్వేదన్నా చక్కగా ఉద్యోగం చేసుకోక ఈ ట్యుటోరియల్ స్కూలు పెట్టుకున్నావేమిటి? ఇది శ్రమ హెచ్చు. ఫలితం తక్కువా కాదూ ?

శా : మీరు స్కూళ్ళ పరిస్థితిచూస్తే అట్లా అనరు. బతకలేక బడిపంతులన్న సామెత ఈనాడు అక్షరాలా నిజం. పైన వందమంది యజమానులు. పరువూ, మర్యాదలూ ఏమీ లేవు. ఆఖరుకు చదువు బాగా చెప్పామన్న తృప్తికూడా దక్కనివ్వరు. అధికార్ల పిల్లలైతే వాళ్ళని చూసికూడా వోణకాలి. ఇప్పుడు నాకేం విచారముందో చెప్పండి. జీతం డెబ్భై ముట్టినా, నూరుముట్టిన ఈ జీతంరాళ్ళకోసం ఒకరిని దేహీ అని అడగక్కర్లేదు. పిల్లలకు చదువు అంటు తుంది. వాళ్ళు చదువుకోసమే వస్తారు. మనం చదువే చెబుతాం. ఇంకే రాజకీయాలు ఉండవు. ఇంకో రెండు మూడేళ్ళు ఆగి చూడండి. స్కూలును ఎటువంటిస్థితికి తెస్తానో. సీతా! నువ్వు ఇంకో ఉద్యోగం చూడకుండా ఉండిపోతే నీకూ గిట్టుబాటవు తుంది. నాతోసమంగా నీకూ ముక్కోట్లు చూస్తాను

సీ . అట్లాగేలెండి. ఉన్నవూళ్ళో ఉద్యోగం దొరికితే ఎవ రన్నా కాదంటారా ?

శా : నేనూ సగం ఆ ఉద్దేశంతోనే పైవూళ్ళ ఆశ వదులు కున్నా. అయితే నువుకూడా ఇవాళనుంచీ ట్యుటోరి యల్ స్కూల్లో...

( ట్యుటోరియల్ స్కూలు )

సీత : ఏమిటి, చలపతీ ! నువ్వింకా ఇక్కడే ఉన్నావేం ? ఇంటికి వెళ్ళలా ?

చలపతి : లేదండీ. శాస్త్రి మేస్టారు వస్తారేమో అని చూస్తున్నా.

సీ : దీపాలు పెట్టిగాని రారేమో... కొంచెం పనిమీద వెళ్ళారు. నాతో చెబితే నే నాయనతో చెబుతా.

చ : ఏంలేదండీ. పట్నంనుంచి మా అన్నయ్యొచ్చాడు. రేపు శలవు కావాలి.

సీ : మీ సొంత అన్నయ్యా ?

చ : కాదండీ. మా పెదనాన్నకొడుకు. రామదాసనీ, ఈ స్కూల్లోనే మేస్టరుగా ఉండేవాడు. ఇప్పుడు సినిమా కంపెనీలో పనిచేస్తున్నాడు.

సీ : ఓహో...ఆయనా !

చ : షూటింగు పదిరోజులాగిందిట. అందర్నీ చూద్దామని వచ్చాడు. వారంరోజులుండి మళ్ళీ పోతాడు.

సీ : వారంరోజులూ చదువు మానేస్తావా ఏమిటి ?

చ : లేదండీ. రేపు శలవుపెడితే శని ఆదివారాలు కలిసొస్తయ్. మా అన్నయ్య దగ్గరఊళ్ళకు పోతున్నాడు. నన్నుకూడా తోడురమ్మన్నాడు.

సీ : శాస్త్రిమేస్టారితో చెబుతాలే. మీ అన్నయ్య పనిచేస్తున్నది ఏ పిక్చర్లో ?

చ : సవతితల్లో, పెంపుడుతల్లో, ఏదో ఉందండీ. ఇంకా పేరు పెట్టలా...

సీ : అట్లాగా ? అందులో ఆయనకేంపనీ ?

చ : అసిస్టెంటు డైరెక్టరనుకుంటా. అన్నిఖర్చులు పెట్టుకుని రెండొందలయాభై ఇస్తున్నారు.

సీ : (వినపడీ వినపడకుండా) అయిదారింతలు జీతం !

చ : ఏమిటండీ ?

సీ : (తొందరగా) ఏమీలేదు. కావలిస్తే వెళ్ళు. నేను శాస్త్రి గారికోసమే కనిపెట్టుకునివున్నా. రాగానే చెబుతాలే.

చ : అయితే వెళ్ళొస్తానండీ.

సీ : మంచిది. (సీత ఏదో పుస్తకంపేజీలు తిరగేస్తూ, మధ్య మధ్య ఏదో రాసుకుంటూ వుంటుంది. గడియారం ఆరు కొడుతుంది. సీత తనలోతాను యేదో పాడుకో సాగుతుంది)

దా : (బయటినుంచి) శాస్త్రీ! (కొంచెం ఆగి) శాస్త్రీ!

సీ : (కూనిరాగం ఆపి) ఎవరూ ?

దా : (దగ్గిరికివచ్చి) శాస్త్రి లేడాండీ? మీరెవరూ ?

సీ : ప్రస్తుతం నేనికడ టీచర్ని. మీరు...

దా : సరిపోయింది! నేను ఎక్స్ టీచర్ని. నాపేరు దాసు శాస్త్రి ఎక్కడికెళ్ళాడో ?

సీ : ఇప్పుడే వస్తారు కూచోండి.

దా : కూర్చోటానికేం? మనవాడు ఆడటీచర్ని సంపాదిం చాడా! (తనలోతాను నవ్వుకుంటున్నట్టు కనిపిస్తాడు)

సీ : సంపాదించటం దేనికీ? ఆయన నన్ను చిన్నతనంనుంచీ ఎరుగును. కొత్తగా బియ్యే పాసయ్యాను. మీరు స్కూలు వదిలిపెట్టిపోతే మీ పని నేను చేస్తున్నా.

దా : నేను వద్దన్నానా ఏమిటి? మహారాజుగా చెయ్యొచ్చు. అసలు శాస్త్రికి అసిస్టెంటుగా పనిచేసినవాళ్ళకి అదృష్టం పడుతుంది. నన్ను చూడరాదూ? యెవడు చూశాడు. కేపెవరన్నా వచ్చి నన్నో సినిమాకు ఎగరవేసుకు చక్కా

పోవొచ్చు. అసలు నిన్ను చూడగానే పంతులమ్మ అను కోలా. ఎవరో సినిమాస్టారనే అనుకున్నా.

సీ : దానికి నేనేమనాలి ?

దా : ఏమీ అనొద్దు. వేళాకోళానికంటున్నాననా ? సినిమా స్టార్లు నీకన్న పొడిచేసిందేమీలేదు. నేచూశాగా?

సీ : నాబోటి మానవమాత్రులకు సినిమా చాన్సులు రావను కున్నానే ?

దా : అహారించినట్లుంది. నేను పరమ మానవమాత్రుణ్ణి. నాకు చాన్సురాలా ? అదేంలేదు. కాస్త పిలకపట్టుకు పైకి గుంజేవాడుండాలి. అంతే ఆరాజ్యలక్ష్మి సినిమాల్లో కెట్లా వచ్చిందీ? ఆవిణ్ణి స్టార్ చేసింది ప్రొడక్షన్ మేనేజరుకాదూ?

: సినిమాకి దొడ్డిదార్లున్నాయంటారు ?

దా : సరేలే...ఉన్నవే దొడ్డిదార్లు ? తలవాకిలికోసం వెతుకు తున్నవాళ్ళింకా వెతుకుతూనే ఉన్నారు.

సీ : మీరు చెప్పేదాన్నిబట్టి నాకు సినిమాలంటే వున్న గౌరవం కాస్తా పోతోంది.

దా : ఛీ, ఛీ! అట్లా అనుకోవటం పొరపాటు. అసలీ సినిమా అన్నది అంత తొందరపడి అర్థంచేసుకునేదిగాదు. దిగితే గాని లోతు తెలీదు; తింటేగాని రుచి తెలీదంటారే ? అది సినిమాగురించి అన్నమాటే.

సీ : అయితే సావకాశంగా కూచుని మీ ద్వారా ఆ విషయా లన్నీ వింటా! మనం పరాయివాళ్ళం కాదులెండి. మీ తమ్ముడు నా శిష్యుడే. మీరు వచ్చారని శలవడిగాడు కూడా.

దా : లేకపోతేమాత్రం పరాయివాళ్ళమూ ? ఇద్దరం ఒక కుర్చీలో కూచున్న వాళ్ళమేగా ?

సీ : అంతకన్న, మీరే నాకీ వుద్యోగం ఇచ్చారని చెప్ప రాదూ ?

దా : బాగా చెప్పావ్.

సీ : కాస్త పనివుంది. ఇది చూస్తాను. ఈలోపుగా శాస్త్రిగారే వస్తారు.

దా : నిరాక్షేపణగా. (ఏదో ఈలపాట పాడి అకస్మాత్తుగా ఆగుతాడు)

శాస్త్రి : (వస్తూ) ఏం సీతా ! నాకోసం కనిపెట్టుకున్నావా ? (ఆశ్చర్యంతో గొంతెత్తి) ఇదేమిటోయ్, ఎప్పుడు రావటం ?

దా : వచ్చా; నా శరీరం అక్కడుందిగాని మనసంతా స్కూలు మీదే వుంది. కిందటేడుకంటె మన స్కూలు కాస్త కళకళ్ళాడుతోందికదూ ?

శా : (ఏమెప్పుడుగా) మొత్తానికి సినిమాప్రభావం నీమీద బాగానే వున్నట్టుంది.

దా : మనం నవంబరులో పుట్టాం బ్రదర్, పరిసరాలనుబట్టి ఇట్టె మారిపోతాం. 'చూడుము మీరో'...

శా : ఇప్పుడు మీరో చదువుతున్నావా ఏం ?

దా : ఎందుకడుగుతావు బ్రదర్ ? ప్రతివాణ్ణీ బర్త్‌డేట్ అడగ టం, వాడిబతుకంతా చెప్పెయ్యటం; వాడు దిమ్మర పోవటం ! ఏదీ నీ బర్త్‌డేట్ చెప్పూ ?

సీ : నా బర్త్‌డేట్ సెప్టెంబరు పద్ధెనిమిది. నా సంగతి కాస్త చెప్పండి.

దా : గుడ్ గ్రేషస్ ! అది గ్రేటాగార్బో పుట్టినరోజు వండర్ ఫుల్ ! సెప్టెంబరులో పుట్టినవాళ్ళ తత్వం ఎట్లావుంటుందో తెలుసా ? బుద్ధికి చాకులన్నమాట. వాళ్ళ నిర్ణయమే వాళ్ళదిగాని ఇంకోరిమాటలకు పడరు. వారికి అపజయ మన్నది ఉండదు. అందరితోనూ కలవరు. మనిషి తమ ఘాయీవాడైతేతప్ప, లేకపోతే అంతదూరాన ఉంచుతారు. వాళ్ళు ఎల్లప్పుడూ అందంగా కనపడటానికి యత్నిస్తారు. అందమైన పనిసరాంటితప్ప సహించరు. తెలిసిందా ? ఇత రులు సాధారణంగా సాధించలేని పనులు వాళ్లు సాధించ గలుగుతారు...నీ బర్త్‌డేట్ చెప్పావుకావు శాస్త్రీ...

శా : నాది నవంబరు పధ్నాలుగు.

దా : చంపేశావే; ఇంకేం ? నీది గొప్పజాతకమే.

శా : మనిద్దరికీ ఒకటేరోజులే తేడా అనుకుంటా. నీది పందొమ్మిదన్నట్టు జ్ఞాపకం.

దా : నాకే సరిగా జ్ఞాపకంలేదే ? నీకెట్లా తెలుసు?

శా : అప్పుడే మరిచావా? ఒకసారి మనం అనుకున్నాం— బ్రిటిష్‌రాజు ఒకటో చార్లెస్‌దీ నీదీ ఒకే పుట్టినరోజని !

దా : నాకు కొంచెంకూడా జ్ఞాపకంరావటంలేదు. నే వెళ్ళొస్తా. నాకు కాస్త తొందరపనుంది. మళ్ళీ కనిపిస్తాలే. (పోతాడు)

శా : (కొంచెం ఆగి) మనలో శాస్త్ర చదువుకున్నవాళ్ళూ, పనికొచ్చేవాళ్ళూ ఇట్లా ఎందుకయిపోతారో నా కర్థం కావేదు.

సీ : మీ రాయన్ని, పాపం! చార్లెస్ ది ఫస్టునటం బాగాలేదు.

శా : నా కీ జాతకాల్లో నమ్మకంలేదు. వాడికైనా నమ్మకం ఉంటే తనతలను ఇంకా శ్రద్ధగా ఉంచుకునేవాడే. నిజంగా వాడు పుట్టినతేదీ నవంబరు పందొమ్మిదే తెలిసట్టు నటిస్తాడు. ఎవరి జాతకాలు వాళ్ళు చూసుకోక అందరి జాతకాలూ చూడటం దేనికి ?

సీ : (మాట మారుస్తూ) పొద్దుపోయింది. నేను వెళ్ళిరానా

శా : ఒక్క క్షణం కూచో. నేను నిన్నొకటి అడగాలని చాలా రోజులనుంచీ అనుకుంటున్నాను. ఇప్పుడే అడిగెయ్యాలని పిస్తోంది.

సీ : అడగండి.

శా : ఎప్పటికన్నా నువ్వు పెళ్ళివిషయం ఆలోచించకపోవు. అప్పుడు మిగిలినవాళ్ళతో బాటు నన్నుకూడా మనసులో ఉంచుకో. ఏరోజున నేను నెలకు రెండువందలయాభై కళ్ళ జూస్తే ఆరోజు పెళ్ళికి సిద్ధంగా ఉంటాను ఈలోపల నీ కెవరన్నా నచ్చి పెళ్ళాడితే సరే సరి. లేనట్టయితే ఆనాడు లగాయితు నువ్వు పెళ్లాడేదాకా నేను పెళ్లాడను. నీకు మొహమాటం అక్కర్లేదు. నువ్వు నాతో చేసుకుంటానని తప్ప, చేసుకోనని చెప్పనవసరంకూడా లేదు. సరేనా ?

సీ : ఏమో, ఇప్పుడప్పుడే నాకు పెళ్ళాడాలని ఏమాత్రమూ లేదండి !

శా : నేనైనా ఇప్పుడెట్లా వెళ్లాడగలను? నాదికూడా వచ్చే యేటిమాటే. మరో ఏడు తోసినా తోయ్యవచ్చు.

సీ : వస్తానండీ. అన్నట్టు రేపు చలపతి రానని చెప్పమన్నాడు.

శా : సరే.

(సీత ఇల్లు)

సీత : ఈయన రామదాసుగారు, నాన్నా ?

సోమ : అంటే ?

సీ : నాకుముందు శాస్త్రిగారితోబాటు మేస్టరుగా ఉన్నాయన. ఇప్పుడు పట్నంలో సినిమా కంపెనీలో ఉన్నారని శాస్త్రి గారు చెప్పలా ? అది ఈయనే...

సో : అట్లాగేం! ఆ ఉద్యోగం అయిపోయిందా ? దొరికితే ఇంకో మేష్టర్ని కూడా వేసుకోగలనన్నట్టున్నాడే ? అదేమైనా...

దాసు : (నవ్వి) నాకంత పుస్థితి కలగలేదులెండి మీదయవల్ల. మా పిక్చరు షూటింగులో కాస్త విశ్రాంతి కలిగితే నలుగుర్నీ చూసిపోదామని వచ్చా.

సో : అంతేగద ?

సీ : చూడు, నాన్నా ! ఈయనంటున్నారుగదా, నేను పట్నం పోతే చాలా సులభంగా సినిమాచాన్సు దొరుకుతుం దంటున్నారు. సినిమా స్టార్స్‌లో బిద్యే లెవరూ లేరుట. నాకు బ్రహ్మాండమైన పబ్లిసిటీవస్తుందనీ, అంతులేని డబ్బు వస్తుందనీ అంటున్నారు.

దా : నే ననటమేమిటి ? నిజంగానే వస్తుంది.

సీ : మీరు అనుభవంమీద చెప్పేది మేముమాత్రం నమ్మ లేంటండీ ?

సో : చూడు, నాయనా ! ఈ సినిమాల్లో చేరాలంటే మనం ఏం చెయ్యాలి ?

దా : ఏమీలేదు. మీరు నావెంట పట్నం రావాలి. కొద్ది కాలం వేచిఉంటే చాన్సు తప్పక లభిస్తుంది. అసలందాకా కూడా పనిలేదులెండి. మా పిక్చర్లోనే ఒక చిన్న వేషం ఉంది. దానికింకా ఎవర్నీ బుక్ చెయ్యలేదు. అది మన సీత కిమ్మంటే కళ్ళకద్దుకుని ఒప్పుకుంటారు. డైరెక్టరు మన వాడేగా !

సో : అయినా మనకిప్పుడీ సినిమాలెందుకులేస్తూ, ఏదో ఇట్లా వెళ్ళిపోనీ.

దా : అదే మనదగ్గిరఉన్న పొరపాటు. పెద్దగా ఆశించే శక్తి కూడా మనకులేదు ! మనకన్న తక్కువవాళ్ళు ఆకాశానికి నిచ్చెనలు వేసి పైకిపోతుంటే మనం బావిలో కప్పల్లా ఎందుకుండాలండీ ?

సో : ఇన్నాళ్ళు కష్టపడి బియ్యేపాసై సినిమాల్లో వేషా లేమిటోయ్ ?

దా : అయితే మీకీనాటి సినిమాలను గురించి ఏమీ తెలీదన్నమాట ! ఇప్పుడీ సినిమాతారలకుండే గౌరవం పెద్ద అధికారు కూడాలేదు. ఆమాట కొస్తే నేను బియ్యేను కానుటం . ? బియ్యేడిగ్రీ నాకిచ్చినజీతం యాభయ్యేగా ? అదికూ. సాటివాడికింద నౌకరీ. సినిమాల్లో అట్లాగా. పదిలక్షల అస్తిగల ప్రొడ్యూసరు రేపు మీ సీత రాగానే